Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 8 • 25-2-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# జగన్ దీక్షతో కిరణ్ బేజారు!

కాంగ్రెస్ ప్రభుత్వాన్ని, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని రాజకీయంగా చావు తెబ్బ తీశాడు వైఎస్ జగన్. ఇంతకాలం తన రాజకీయ ఉనికి కోసం జగన్ చేసిన ఉద్యమాలు, పన్నిన వ్యూహాలు, వేసిన ఎత్తుగడలు, అనుసరించిన పోకడలు, విసిరిన సవాళ్లు అన్నీ ఒక ఎత్తు. విద్యార్థుల ఫీజుల చెల్లింపు కోసం ఇప్పుడు చేపట్టిన దీక్ష ఒక్కటే ఒక ఎత్తు. కొన్ని లక్షల మంది విద్యార్థుల భవిష్యత్తుతో, ఆర్థిక సమస్యలతో ముడిపడిన ఈ సున్నిత సమస్యపై సరైన సమయంలో తలపెట్టిన వారం రోజుల దీక్ష జగన్ రాజకీయ స్థాయిని అమాంతంగా పెంచివేశాయి. ఇంతకాలం మహానేత వైఎస్, యువ నేత జగన్ అన్న వూకదంపుడు మాటలతో నడిచిన జగన్ ఉద్యమం ఈ ఫీజు దీక్షతో ఒక స్పష్టమైన రాజకీయ కోణాన్ని సంతరించుకొన్నది. విద్యా సంవత్సరం ముగిసే దశకు చేరుకొని, పరీక్షల సమయం వచ్చినా కూడా ప్రభుత్వం ఫీజులు చెల్లించక పోవడంతో ఇంజనీరింగ్, మెడికల్ వంటి వృత్తి విద్యా సంస్థలలో చదివే విద్యార్థులు చాలా అలజడికి, ఆందోళనకు గురౌతున్నారు. పరీక్షలు వ్రాయగలమా లేదా, కాలేజి యాజమాన్యాలు అందుకు ఒప్పుకొంటాయా లేక పరీక్షలకు అడ్డం పడతాయా అన్న భయం విద్యార్థులందరిలో గూడుకట్టుకొని వుంది. సుప్రీంకోర్టు మొట్టికాయలు వేసినా, చీవాట్లు పెట్టినా కిరణ్ సర్కారు ఖాళీ ఖజానా చూపించి, తేల మాటలు మాట్లాడుతున్నది. పాత బాకీలు ఇవ్వడానికే ఇంత ఆయాస పడుతున్న ప్రభుత్వం భవిష్యత్తులో ఈ పథకం కొనసాగించడం జరిగే పనేనా అన్న సందేహం అందరినీ వేధిస్తున్నది. ఈ నేపథ్యంలో జగన్ ఆ సమస్యపై దీక్ష చేపట్టడంతో విద్యార్థి లోకంలో ఆయన పట్ల ఆరాధనా భావం పెరిగిపోయింది. రాజకీయాలకు దూరంగా మెలిగే కోట్లాదిమంది యువకులు ఒక్కసారిగా జగన్ పట్ల ప్రేమ పెంచుకొనే పరిస్థితి ఏర్పడింది.

కాంగ్రెస్ పార్టీకి రాజకీయంగా ఇంతకంటే పెద్ద దెబ్బ వేరొకటి వుండదు. పది మంది ఎమ్మెల్యేలు చేజారితే ఏ చిరంజీవినో, ఒవైసీనో ప్రాధేయపడి ప్రభుత్వాన్ని నిలుపుకోవచ్చు. అవిశ్వాసం పెడితే చంద్రబాబుతో రాజీపడి వూపిరి నిలుపుకోవచ్చు. కాంగ్రెస్ కార్యకర్తలను మూకుమ్మడిగా తరలించుకపోతే, ఎన్నికల నాటికి ఎట్లానో వెనక్కు తెచ్చుకోవచ్చులెమ్మని సర్దుకోవచ్చు. కానీ యువతరం మొత్తం, కాంగ్రెస్ పట్ల ద్వేషం, జగన్ పట్ల ప్రేమ పెంచుకొనే పరిస్థితి ఏర్పడితే ఇక కాంగ్రెస్‌కు భవిష్యత్తు అన్నది ఏమి మిగులుతుంది?

ఢిల్లీ, విజయవాడ దీక్షల వలె ఈసారి ఎందువల్లనో జగన్ తన కార్యక్రమానికి పెద్దగా ప్రచారం ఇవ్వలేదు. ఆగం చేయలేదు. ఆడంబరం ప్రదర్శించలేదు. చాలా సాధారణంగా దీక్ష మొదలు పెట్టాడు. కానీ గతంలో జరిగిన కార్యక్రమాలకు రాని ప్రజాకర్షణ దీనికి సహజంగా వచ్చింది. హైదరాబాదులో, తెలంగాణ ఉద్యమం పతాక స్థాయికి చేరిన సమయంలో, కరడుకట్టిన సమైక్యవాది అయిన జగన్‌కు టిఆర్ఎస్ వర్గాల నుంచి అడ్డంకులు రావచ్చున్న భయాందోళన మధ్య ప్రారంభమైన దీక్ష, అనుకొన్న దానికంటే అధికంగా విజయవంతమైంది. తెలంగాణ రాష్ట్రాన్ని ప్రగాఢంగా కోరుకొంటూ, ఉస్మానియా విశ్వ విద్యాలయంలో పోలీసులతో వీధి పోరాటానికి దిగుతున్న విద్యార్థులు కూడా జగన్ శిబిరానికి వచ్చి సంఘీభావం తెలిపి పోవడం విశేషంగా చెప్పుకోవలసిన అంశం. ఏ రాజకీయ పార్టీ కూడా జగన్ దీక్షను చులకనగా మాట్లాడలేక పోయింది. రాజకీయ నిందలు ఆపాదించలేకపోయింది.

కోట్ల సంఖ్యలో వుండే విద్యార్థులు, యువకులలో జగన్ ప్రభావం అంతగా పెరగడం అటు కాంగ్రెస్‌కు, ఇటు తెలుగుదేశం పార్టీకి కూడా కల

కొరవ 14వ పేజీలో

## కెవిపి కన్పించాడు

గత మూడు నెలలుగా ఎవరికీ కనపడకుండా దుబాయిలో తల దాచుకొన్న వైఎస్ ఆంతరంగిక మిత్రుడు కెవిపి రామచంద్రరావు, మళ్లీ దర్శనమిచ్చాడు. నాలుగు రోజుల క్రితం హైదరాబాద్‌కు వచ్చాడు. అయితే రాజకీయాలలో మాత్రం తల దూర్చడం లేదు. తెలిసిన వారి పెళ్లిళ్లకు మాత్రం హాజరౌతున్నాడు. అయితే ఆయన దుబాయ్ నుంచి నేరుగా భారతదేశానికి రాలేదని, మధ్యలో మరొకదేశం వెళ్లి, వైఎస్‌కు సంబంధించిన జమాఖర్చుల లెక్కలు ఒక ముఖ్యుడికి అప్పచెప్పి, కొన్ని కాగితాల మీద సంతకాలు చేసి, ఆ తర్వాత భారతదేశం విమానం ఎక్కాడట. తన ప్రాణానికి హామీ దొరికిందనే నమ్మకం కల్గిన తర్వాతనే ప్రయాణం పెట్టుకొన్నాడట ఆయన. ఆ లెక్కలేమిటో, ఆ ప్రాణ ప్రమాదం ఎవరి నుంచో మనకైతే తెలియదు.

## కార్టూన్ స్కేప్

ప్రజలతో కుమ్మక్కయ్యే పార్టీ మాత్రం ఏదీ లేదు..!

## ఫిఫ్టీన్ టు ఫిఫ్టీ మంత్రి

మొన్నటి వరకు నీళ్ల మంత్రిగా వుండిన పొన్నాల లక్ష్మయ్య 15వేల కోట్ల రూపాయల బడ్జెట్‌కు అధిపతిగా వుండేవాడు. జలయజ్ఞం కాంట్రాక్టర్లంతా ఆయన చుట్టూ గుమికూడి వుండేవారు. ఆయన ఇల్లు సిరి సంపదలతో కళకళలాడేది. కానీ కిరణ్‌కుమార్‌రెడ్డి ఎందువల్లనో ఆయన్ను ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ శాఖకు మార్చారు. దానికి ఈ ఏడాది బడ్జెట్‌లో కేటాయించిన మొత్తం కేవలం 50 కోట్ల రూపాయలు. తన పరపతి అంత తగ్గిందన్న దిగులును మర్చిపోవడానికి, నేను ఫిఫ్టీన్ నుంచి ఫిఫ్టీకి ఎదిగానని తన మీద తానే ఛలోక్తులు విసురుకుంటున్నాడు పాపం పొన్నాల. నీళ్ల శాఖలో వున్నంతకాలం పొన్నాల ఇల్లు కాంట్రాక్టర్ల రాకపోకలతో నిత్య కళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లేది. ఇప్పుడు ఈగలు తోలుకొంటున్నది. రాజకీయాలలో ప్రాభవ, పతనాలు ఎంత విచిత్రంగా వుంటాయో అర్థం చేసుకోవడానికి పొన్నాలే ఒక ఉదాహరణ.

# కుములుతున్న గవర్నర్!

రాష్ట్ర గవర్నర్ ఇఎస్ఎల్ నరసింహన్ అవమాన భారంతో కుమిలి పోతున్నాడు. తన ప్రతిష్ట మంట కలిసిపోయిందని మధన పడుతున్నాడు. నక్సలైట్లు, తెలంగాణ, జగన్ గొడవలతో అరాచకమయమై పోతున్న ఆంధ్ర రాష్ట్రాన్ని చక్కదిద్దడానికి కేంద్రం నుంచి ప్రత్యేకంగా దిగుమతి అయిన వాడాయన. ఐపిఎస్ అధికారిగా ఆయనకు ఎంతో మంచి పేరు. ఐబి అధిపతిగా ఎనలేని కీర్తి సంపాదించుకొన్నాడు. శాంతిభద్రతల అదుపులో కర్కశంగా వ్యవహరించగల కఠినాత్ముడని పేరు. అయితే ఆంధ్ర రాష్ట్రాన్ని రక్షించే మాట దేముడెరుగు, శాసనసభలో తనను తాను రక్షించుకోలేని దయనీయ స్థితిలో పడిపోయారాయన. రాజకీయ పార్టీలేవి కూడా ఆయన్ను గౌరవప్రదమైన రాజ్యాంగ పదవిలో వున్నవాడిగా చూడడం లేదు. రాజకీయంగా తమను అణిచివేసే ప్రయత్నంలో వున్న కేంద్ర ప్రభుత్వ ప్రతినిధిగా మాత్రమే చూస్తున్నాయి. అందువల్లనే శాసనసభలో ఆయన పట్ల టిఆర్ఎస్, టిడిపి ఎమ్మెల్యేలు చాలా దురుసుగా ప్రవర్తించారు. గవర్నర్ వ్యక్తిగత రక్షణ సిబ్బంది అడ్డుపడబట్టి సరిపోయింది కానీ ఆయన ఒంటి మీద దెబ్బ పడి వుండేది. శాసనసభలో దెబ్బలు తిన్న గవర్నర్‌గా చరిత్రలో అవమానకర స్థానం దక్కి వుండేది. ఆ

కొరవ 14వ పేజీలో

# దేముడంకెలు

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రవేశపెట్టిన నూతన బడ్జెట్, రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఎంతటి దివాలా స్థితిలో వుందో చెప్పకనే చెప్తున్నది. చరిత్రలో లేనివిధంగా లక్షా 23వేల కోట్ల రూపాయల ఖర్చు అంచనాతో రికార్డుస్థాయి బడ్జెట్ ప్రవేశపెట్టానని మంత్రిగారు ఎంతగా చంకలు చరుచుకొన్నా, వాస్తవ పరిస్థితి మాత్రం అందుకు విరుద్ధంగా కన్పిస్తున్నది. బడ్జెట్ అంటే అర్థం – ప్రభుత్వానికి వచ్చే రాబడిని అంచనా వేసి, దానికనుగుణంగా ఖర్చుల ప్రణాళిక సిద్ధం చేసుకోవడం. కానీ గత కొన్ని సంవత్సరాలుగా మన బడ్జెట్లు రాబడి ఆధారంగా కాక, ఖర్చుల వూహలతో రూపుదిద్దుకొంటున్నాయి. ప్రభుత్వ ఖజానాకు రాగలదనుకొన్న రాబడితో సంబంధం లేకుండా, పథకాలకు ఇంత ఖర్చు పెడతాము, అంత ఖర్చు పెడతాము అని గొప్పలు చెప్పుకోవడానికి బడ్జెట్‌ను ఒక సాధనంగా వాడుకొంటున్నారు. ఈ ఏడాది జరిగింది కూడా అదే.

2004లో వైఎస్.రాజశేఖర్‌రెడ్డి అధికారంలోకి వచ్చిననాటి నుంచి రాష్ట్ర ప్రభుత్వం అత్యంత ప్రాధాన్యత ఇస్తున్న పథకాలు – నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణం, ఇందిరమ్మ ఇళ్లు, విద్యార్థులకు ఫీజు చెల్లింపు, ఆరోగ్యశ్రీ, వృద్ధాప్య పింఛన్లు. 2005 – 06 సంవత్సరంలో వైఎస్ రూపొందించిన బడ్జెట్ పరిమాణం కేవలం 55330 కోట్ల రూపాయలు. ఇప్పుడది లక్షా 28వేల కోట్లకు పెరిగింది. కానీ ఆ నిష్పత్తిలో వైఎస్ తలపెట్టిన పథకాలకు కేటాయింపులు మాత్రం పెరగలేదు. జలయజ్ఞం ప్రాజెక్టుల నిర్మాణానికి గత సంవత్సరం 15వేల కోట్లు కేటాయించారు. కానీ ఖర్చు పెట్టింది మాత్రం 5500 కోట్లు మాత్రమే. ఈ ఏడాది కూడా 15వేల కోట్లు ఇచ్చారు కానీ, గత ఏడాది కొరతను ఎట్లా పూడ్చేది చెప్పలేదు. ఏటా 5వేల కోట్ల మేర ఖర్చు పెడితే వైఎస్ ప్రారంభించిన నీటిపారుదల ప్రాజెక్టుల నిర్మాణం పూర్తికావడానికి మరొక యాభై ఏళ్ల సమయం పట్టినా ఆశ్చర్యం లేదు.

2009లో కాంగ్రెస్ మళ్లీ అధికారంలోకి రావడానికి ప్రధాన కారణం ఆరోగ్యశ్రీ పథకం. కానీ ఆర్థిక మంత్రివర్యులు దాన్ని పూర్తిగా విస్మరించాడు. ఒక్క రూపాయ అదనపు నిధి కేటాయించలేదు. మొన్న జరిగిన రచ్చబండలో ఐదు లక్షల మందికి కొత్తగా రేషన్ కార్డులిస్తామని ఆడంబరంగా ప్రకటించాడు కొత్త ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. కానీ బడ్జెట్‌లో మాత్రం సబ్సిడీ బియ్యం ఖర్చు పద్దును 3వేల కోట్ల నుంచి 2500 కోట్లకు తగ్గించారు. అంటే దాని అర్థం రేషన్ బియ్యంలో కోత పడబోతున్నదని. వృద్ధాప్య పింఛన్ల విషయంలోనూ గత ఏడాది ఖర్చు 1932 కోట్లకు ఒక్క రూపాయి అదనంగా ఇవ్వలేదు. కానీ ముఖ్యమంత్రి మాత్రం కొత్తగా 2లక్షల 93వేల మందికి పింఛన్లు ఇస్తామని వుత్తుత్తి వాగ్దానం చేస్తున్నారు.

వరస వరదలు, తుఫాన్లతో రాష్ట్రంలో రోడ్లు అధ్వాన్నంగా తయారై వున్నాయి. గ్రామాలకు వెళ్లే రహదారులైతే నరకాన్ని తలపిస్తున్నాయి. కానీ బడ్జెట్‌లో మాత్రం రోడ్ల కోసం కనీసపాటి నిధులు కేటాయించలేక పోయారు. ఇందిరమ్మ ఇళ్ల పథకం దాదాపు మూలపడినట్లే అని బడ్జెట్ చెప్పకనే చెప్పింది.

జమీన్‌రైతు

రాష్ట్ర ఆర్థిక పరిస్థితి దివాలా స్థితికి ఇదొక ప్రతిబింబం. పన్నుల రాబడి ఎంతగా పెరిగినా, జీతభత్యాలకే చాలని పరిస్థితి. జీతాలు, పింఛన్లు, ఇతరత్రా వ్యయానికి 85వేల కోట్ల రూపాయలు ఖర్చు అవుతున్నాయి. రాబడి పద్దులో ప్రభుత్వ స్థలాల అమ్మకం ద్వారా రాబట్టుకోవాలన్న పదివేల కోట్ల రూపాయలు కలగానే మిగులుతున్నది గత రెండేళ్లుగా. తెలంగాణ ఉద్యమం వల్ల భూముల రిజిస్ట్రేషన్ రాబడి క్షీణించి పోతున్నది. ఒక్క మద్యం అమ్మకాలు మాత్రమే ప్రభుత్వానికి నికర రాబడి. చాలా అసహ్యమైన పరిస్థితి అది. కానీ వేరే మార్గం లేదు. అందువల్లనే అదనపు మద్యం అమ్మకాల ప్రోత్సాహకానికి ప్రభుత్వం మార్కెటింగ్ ప్రణాళికలు రచించక తప్పడం లేదు.

బడ్జెట్ మొత్తం లక్షా 28వేల కోట్లని ఎంత ఘనంగా ప్రకటించుకొన్నా, అది దేముడంకె అన్నది నిజం. వాస్తవంలో బడ్జెట్ పరిమాణం 90 నుంచి 95వేల కోట్లు మించదు. అందులో 85వేల కోట్లు జీతాలు, వడ్డీలకు పోతే మిగిలేది నామమాత్రం. దీన్ని బట్టి, రానున్న సంవత్సరంలో ప్రజలకు మేలు చేసే సంక్షేమ కార్యక్రమాలు కానీ, నీటిపారుదల ప్రాజెక్టుల వంటి శాశ్వత నిర్మాణాలు కానీ వుండవని అర్థం చేసుకోవాలి.

## జనవాణి

### జయప్రకాష్ నారాయణ్‌పై దాడి అమానుషం!

లోక్‌సత్తా పార్టీ రాష్ట్ర అధ్యక్షుడు డాక్టర్ జయప్రకాష్ నారాయణ్‌పై అసెంబ్లీ ప్రాంగణంలో టిఆర్ఎస్ పార్టీ దాడులకు దిగడం దారుణం. రౌడీయిజంతో తెలంగాణ రాష్ట్రాన్ని పొందవచ్చని ఆ పార్టీ భావిస్తున్నట్లుంది. అసెంబ్లీలో గవర్నర్ ప్రసంగాన్ని అడ్డుకొని, ప్రసంగ ప్రతులను చించి వేయడం వంటి చర్య ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది. ఏదిఏమైనా రాష్ట్రంలో శాంతిభద్రతలు విఫలమయ్యాయి. శాసనసభ్యుడికే శాసనసభలో రక్షణ లేకపోతే సామాన్య పౌరునికి దిక్కెవరు?

కొప్పోలు రామారావు, నెల్లూరు

### ఇదేం పని?

ప్రజాస్వామిక దేశంలో ఎవరి అభిప్రాయాలు వారు వెలిబుచ్చే స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ప్రతి ఒక్కరికి వుంటాయి. పైగా విభిన్న సిద్ధాంతాలతో నిండిన భారతదేశంలో అసెంబ్లీలో గానీ, పార్లమెంట్‌లో గానీ ఏ అభిప్రాయమైనా వెలిబుచ్చే స్వాతంత్ర్యం సభ్యులకుంటుంది. అటువంటి పరిస్థితులు అసెంబ్లీలో తన వాణిని వినిపించిన డాక్టర్ జయప్రకాష్ నారాయణపై దాడి అమానుషం. అతినీచం. ఈ సంఘటనకు కారకులైన వారిపై కఠిన చర్యలు తీసుకోవాలి. ఇటువంటివి భవిష్యత్తులో పునరావృతమైతే సీమాంధ్ర ప్రాంతీయులు చూస్తూ ఊరుకోరు.

ఆచార్య ఆదిత్య, నెల్లూరు

### రోడ్డు ప్రక్కన సున్నమెందుకు?

నెల్లూరు కార్పొరేషన్ పారిశుద్ధ్య సిబ్బంది నగరంలో విఐపిల పర్యటన సందర్భంగా రోడ్ల వెంబడి సున్నం పోస్తున్నారు. ఈ సున్నం ఎండకు ఎండి గాలికి లేస్తూ దారిన నడిచివెళ్లే వారి ముక్కులు, గొంతుల్లోకి వెళ్లి అనారోగ్యం పాలయ్యేట్లు చేస్తున్నది. ఈ సున్నం వల్ల ప్రయోజనం శూన్యం. మునిసిపల్ అధికారులు ఈ విషయమై ఆలోచించి సున్నపు గీతలకు స్వస్తి చెబితే మంచిది.

కెవి.కృష్ణయ్య, నెల్లూరు

### ప్రాణాలతో చెలగాటం వద్దు!

ఫిబ్రవరి 11తేది 'జమీన్‌రైతు' పత్రికలో నెల్లూరు చెరువులో విషాదం పేరిట వచ్చిన వార్త చదివి హృదయం బరువెక్కింది. మనిషి ప్రాణానికి మించింది ఏమీ లేదు. చెరువులో బోటు షికారును పర్యాటకశాఖ నిర్వహించవచ్చు. కాని బోటును నడిపే డ్రైవర్‌తోపాటు దానిలో ఎక్కిన పర్యాటకులకు లైఫ్ జాకెట్లు ఇచ్చి వాటిని ధరించేలా ఆదేశాలివ్వాలి.

ప్రొఫెసర్ కె.నాగరాజారావు, హైదరాబాద్

## 70 ఏళ్ల క్రితం ఈవారం

28-2-1941
పేజీలు : 12 వెల: అణా

### తమాషా

మొన్న 'జమీన్‌రైతు' ఆఫీసులో 3 దినాలు పోలీసు సోదా జరిగింది. ఆ సందర్భంలో ఒక వ్యాసమునకు పైన శీర్షిక 'బలత్కారంగా నిర్బందించి' అని వుండింది. 'బలత్కా' అన్న భాగానికి "రంగా నిర్బంధించి" అన్న భాగానికి మధ్య స్థలం వున్నందున "బలత్కా అన్న భాగాన్ని వదలి – రంగా నిర్బంధించి" అన్న హెడ్డింగు మాత్రం చూచి గాబరాపడి వ్యాసమంతా చదివారు కంటిలో వత్తిపెట్టుకొని పోలీసువారు. చివర్న చూస్తురుగా ఇదీ గమ్మత్తు. తర్వాత పోలీసు వారి భాషాజ్ఞానానికి నవ్వుకున్నుము లెండి.

మరొక(Short Story) చిన్న కథకు 'మా రాజ్యం' అని హెడ్డింగు వున్నది. రాజ్యం అంటే రచయిత పెట్టుకొన్న పేరు. అసలు లక్ష్మీరాజ్యమనో ఏమో వుంటుంది. పోలీసు వారి భాషలో 'మా రాజ్యం' అంటే స్వరాజ్యం అనే భావంతో ఆ వ్యాసం అక్షరమక్షరము విరగ్గొట్టి శోధించారు. కథ కింద అర్థం చేసుకునేటప్పటికి కోళ్లు కూసినవి. ఇది రహస్యంగా చదువుకోండి!

### నెల్లూరు ముచ్చట్లు

### గవర్నరు రాక

మద్రాసు గవర్నరు గారు తిరుగా మార్చి 26వ తేది నెల్లూరు వస్తున్నారు. మ్యాక్ దొర పుణ్యాన, లాటరీ టిక్కెట్ల పుణ్యాన.

### మున్సిపల్ పన్నులు

కమీషనరు గారూ! పన్నుల గోల జాస్తిగా వున్నది. అప్పీలు కేసులన్నీ ఆయా వార్డు కౌన్సిలరును దగ్గరుంచుకొని విచారించి న్యాయం చేయండి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

24-2-1961
పేజీలు: 12 వెల: 0–20 న.పై

### బాలకృష్ణారెడ్డి సేవా చిహ్నం

పాతికేళ్ల క్రితం 15 మంది విద్యార్థులతో ప్రాథమిక పాఠశాలకు అనుబంధంగా నెలకొల్పిన హాస్టలును, ఈనాడు దాదాపు పన్నెండు వందల మంది బాలబాలికలతో, ఏడెనిమిది వందల మంది విద్యార్థుల సంఖ్య కలిగిన హైస్కూలుతో విలసిల్లజేసి, మండలాంతర – కాదు రాష్ట్రాంతర కీర్తిని పొందిన ఘనత నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి గారిది. ఈ కృషి అంతా జరిగింది హరిజన విద్యార్థి ఉద్ధారక సంఘం పేరుతో అయినా, చేసింది బాలకృష్ణారెడ్డి గారొక్కరే. ఈ హాస్టలు చరిత్ర దేశవ్యాప్తమై బహుముఖ మన్ననలను పొందిన నేడు దీని నిర్వహణ అంత కష్టతరం కాకపోవచ్చు. కానీ దీనిని ఈ స్థాయికి తీసుకొనివచ్చుటలో ఎవరైనా ఎదుర్కొనవలసిన కష్టనష్టాలు, సాధక బాధకాలు, నిందాపనిందలు ఊహించుకొన్నప్పుడు అది అనన్యసామాన్యమైన కృషి అని అంగీకరించక తప్పదు. అది ఒక్క బాలకృష్ణారెడ్డి గారికే సాధ్యమయింది. వారి సేవాసక్తి, కర్తవ్య తానురక్తి, సుదూర దృష్టి, నిర్మాణ దక్షత, అచంచల విశ్వాసం, అంకురిత దీక్షా పరతంత్రత ఆ సంస్థల నేటి మహోన్నత స్థితికి హేతువులైనవి. ఈనాడు రెసిడెన్షియల్ హైస్కూలు కేంద్రంగా రాణిస్తున్న వాకాడు, త్వరలో కళాశాలగా ఆ పిమ్మట – బాలకృష్ణారెడ్డి గారి జీవితాంతంలోగానే, వారి సేవాఫలితంగానే రెసిడెన్షియల్ విశ్వవిద్యాలయంగా రూపొంది శోభిస్తే ఆశ్చర్యం లేదు. ఆ మహర్భాగ్యం ఆ గ్రామానికున్నదేమో! ఆ ప్రాప్తం బాలకృష్ణారెడ్డి గారి కున్నదేమో! ఎవరు చూచి వచ్చారు?

### పండిత గోవింద వల్లభ పంత్ అనారోగ్య స్థితి

కాంగ్రెస్ కురువృద్ధులు, హోంశాఖ మాత్యులు గోవింద వల్లభ పంత్ సోమవారం నాడు ఆకస్మికంగా జబ్బునపడి ఇంతవరకు తేరుకొనలేదు. వారికి యింకా స్పృహ రాలేదు. కాంగ్రెస్ మహారథులలో మిగిలి వున్న కొద్ది మందిలో పంత్ ఒకరు. కాంగ్రెస్ అగ్రనాయకుడుగా ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా, కేంద్ర హోమ్ మంత్రిగా పటేల్ తర్వాత ఉక్కు మనిషి అనిపించుకొన్న వ్యక్తి పంత్.

# నెల్లూరు ముచ్చట్లు

## రైతులను ముంచిన అకాల వర్షం

21, 22, 23 తేదీల్లో కురిసిన అకాల వర్షం గూడూరు, కావలి డివిజన్లలోని రైతుల కొంపముంచింది కాలం కాని కాలంలో కురిసిన వర్షానికి కల్లాల్లోని ధాన్యం, వరి ఓదెలు తడిచి ముద్దయ్యాయి. అరటి, కొబ్బరి, పొగాకు, పుచ్చ పంటలకు నష్టం వాటిల్లింది. గత ఏడాది రెండు తుఫాన్లు, భారీ వర్షాలను తట్టుకొని వ్యవసాయం మొదలు పెట్టిన రైతును వరుణుడు మళ్లీ తీవ్రంగా దెబ్బ తీశాడు.

## ఆనంకు అరుదైన అవకాశం

ఆర్థిక మంత్రి హోదాలో ఆనం రామనారాయణరెడ్డి 23వ తేది అసెంబ్లీలో బడ్జెట్ ప్రవేశపెట్టారు. రాష్ట్ర బడ్జెట్ రూపొందించిన రెండవ నెల్లూరు ఆర్థిక మంత్రిగా రామనారాయణరెడ్డి అరుదైన ఖ్యాతి దక్కించుకొన్నారు. 1956 – 57 ప్రాంతంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేస్తుండిన నెల్లూరీయుడు డాక్టర్ బెజవాడ గోపాల్‌రెడ్డి ఆర్థిక శాఖ కూడా నిర్వహిస్తూ బడ్జెట్‌ను ప్రవేశపెట్టారు. 55 ఏళ్ల తర్వాత మళ్లీ ఈ గౌరవం రామనారాయణకు దక్కింది.

## చిన్న పిల్లల ఆసుపత్రి నిర్మాణానికి సర్వం సిద్ధం

నెల్లూరు పెద్దాసుపత్రి ప్రాంగణంలో 100 పడకల చిన్నపిల్లల ఆసుపత్రి నిర్మాణానికి సర్వం సిద్ధం చేశారు. ప్రాంగణంలో ప్రభుత్వం కేటాయించిన ఒకటిన్నర ఎకరా స్థలాన్ని చదును చేశారు. శాసన మండలి ఎన్నికల తర్వాత ఈ ఆసుపత్రి నిర్మాణానికి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేస్తారు.

## ఏప్రెల్ 15 నుంచి నీటి విడుదల

రబీ సీజన్‌కు సంబంధించి రెండో పంటకు నీటిని విడుదల చేసేందుకు ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. 20వ తేది నెల్లూరు గోల్డన్‌జూబ్లీ హాల్‌లో జరిగిన ఐఏబి సమావేశంలో కలెక్టర్ రాంగోపాల్ ఈ ప్రకటన చేశారు. 1,78,169 ఎకరాలకు ఏప్రెల్ 15 నుంచి సోమశిల జలాలను విడుదల చేయాలని సమావేశంలో తీర్మానించారు. ప్రస్తుత ఖరీఫ్ సీజన్‌లో వేసిన పంటకు మార్చి నెలాఖరు వరకు సాగునీటినివ్వాలని నిర్ణయించారు. కలెక్టర్ అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో నీటి సంఘాల ఛైర్మన్లు, రైతు సంఘం నేతలతోపాటు అదనపు జెసి సీతారామయ్య తదితరులు పాల్గొన్నారు.

## ఇసుక మాఫియాకు అధికారుల అండ

జిల్లాలోని ఇసుక మాఫియాకు కొందరు అధికారులు అండదండలు అందిస్తున్నారని జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఆరోపించారు. ఇసుక మాఫియాతో తాను జరిపిన న్యాయపోరాటాన్ని ఆయన 22వ తేదీ విలేకరులకు వివరించారు. ప్రభుత్వానికి రావలసిన కోట్ల రూపాయల ఆదాయానికి మాఫియాతో చేతులు కలిపి అధికారులు గండికొడుతున్నారని, దీనివలన జడ్పీకి 100 కోట్ల రూపాయల నష్టం వచ్చిందని తెలిపారు. దీనికి ప్రభుత్వం అండదండలు అందించడం ఘోరం అన్నారు. కోర్టు ఇచ్చిన ఉత్తర్వులను ప్రభుత్వం తొక్కిపెడుతూ మాఫియాకు కొమ్ముకాస్తున్నదని విమర్శించారు. రాజకీయ ఒత్తిళ్లతో దాడులు చేస్తున్న ఎసిబి అధికారులకు ఇసుక మాఫియా అక్రమాలు కన్పించ లేదా అని ఆయన ప్రశ్నించారు.

## మండలి ఎన్నికలకు 22 నామినేషన్లు

శాసన మండలికి సంబంధించి నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం జిల్లాల పరిధిలోని పట్టభద్రుల, ఉపాధ్యాయ నియోజకవర్గాలకు గడువు ముగిసేటప్పటికి మొత్తం 22 నామినేషన్లు దాఖలయ్యాయి. చిత్తూరు కలెక్టర్ శేషాద్రికి పోటీలో వున్న అభ్యర్థులు ఫిబ్రవరి 22వ తేది సాయంత్రం లోగా నామినేషన్లు అందజేశారు. పట్టభద్రుల నియోజకవర్గానికి 14 నామినేషన్లు, ఉపాధ్యాయ నియోజకవర్గానికి ఎనిమిది నామినేషన్లు దాఖలు చేశారు. వీటిలో అధిక భాగం జిల్లాకు చెందిన వారివే కావడం విశేషం.

## దేవాలయాలను దర్శించిన రోశయ్య

మాజీ ముఖ్యమంత్రి రోశయ్య తన భార్య శివలక్ష్మితో కలసి 20వ తేది జిల్లా పర్యటనకు విచ్చేశారు. వివిధ కార్యక్రమాల్లో పాల్గొనేందుకు వచ్చిన ఆయన పనిలోపనిగా వివిధ దేవాలయాలను దర్శించుకొన్నారు. జొన్నవాడలోని కామాక్షితాయి ఆశీస్సులు అందుకొన్న ఆయన మూలాపేటలోని కంచి కామకోటి మఠాన్ని సందర్శించారు. స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకా పరమేశ్వరి ఆలయానికి వెళ్లారు. నగరంలో తన చిన్ననాటి మిత్రుడైన కె.వి.చలమయ్య ఇంట్లో అల్పాహారం స్వీకరించిన రోశయ్య దంపతులు వాకాడులో జరిగిన నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి విగ్రహావిష్కరణ, ఆర్యవైశ్య కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

## వినూత్న నిరసన

ఫీజు రీఎంబర్స్‌మెంట్ విడుదల చేయడంలో ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ జగన్ వర్గీయులైన కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్‌లు విద్యార్థులతో కలసి వినూత్నంగా నిరసన కార్యక్రమాలు చేపట్టారు. గాంధీబొమ్మ వద్ద నుంచి వి.ఆర్‌సి వరకు వెనక్కు నడిచిన వారు తర్వాత దివిటీ వెలిగించి తమ నిరసనను తెలిపారు. 22వ తేది వివిధ స్కూళ్ల వద్ద ఘంటానాదాలు చేయించారు. ఈ కార్యక్రమంలో పెద్ద సంఖ్యలో విద్యార్థులు హాజరైనారు.

**చందాదారులకు మనవి**

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

జీవిత చందా రూ.1000/-

సంవత్సర చందా
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190



చిత్తూరు, నెల్లూరు, ప్రకాశం జిల్లాల పట్టభద్రుల నియోజకవర్గం నుంచి తెలుగుదేశం పార్టీ తరపున పోటీ చేస్తున్న దేశాయిశెట్టి హనుమంతరావు నామినేషన్ దాఖలు చేస్తున్న దృశ్యం.

## సోమిరెడ్డి ప్రచారం

శాసన మండలిలో నెల్లూరు, చిత్తూరు, ప్రకాశం జిల్లాల పరిధిలోని పట్టభద్రుల స్థానానికి తెలుగుదేశం పార్టీ తరపున పోటీచేస్తున్న దేశాయిశెట్టి హనుమంతరావుకు మద్దతుగా తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి నెల్లూరులో విస్తృత ప్రచారం చేస్తున్నారు. జగన్, చైతన్య, విఆర్ కాలేజి, మెక్లిన్స్ క్లబ్‌కు సైతం వెళ్లి పట్టభద్రుల ఓట్లు అర్థించారు. ఆయన వెంట కిలారి వెంకటస్వామి నాయుడు, ధర్మవరపు సుబ్బారావు, సంపత్, అంచల వాణి తదితరులు వున్నారు.

## మాదరన్ రెటీనా సెంటర్‌లో కాన్ఫరెన్స్‌హాల్

నెల్లూరు పొగతోటలోని మాదరన్ రెటీనా సెంటర్‌లో ప్రఖ్యాత నేత్ర వైద్యులు దివంగత డాక్టర్ వెంకటస్వామి స్మృత్యర్థం నిర్మించిన కాన్ఫరెన్స్ హాల్‌ను కోయంబత్తూరు అరవింద్ ఐ హాస్పిటల్ విట్రియో రెటినల్ విభాగాధిపతి డాక్టర్ వి.నరేంద్రన్ 20వ తేది ప్రారంభించారు. ఈ సందర్భంగా డాక్టర్ నరేంద్రన్ ఇంట్రా విట్రియల్ ఇంజక్షన్, డాక్టర్ శరవణన్ ఆప్టికల్ కోహిరెన్స్ టోమోగ్రఫీ అంశాలపై మాట్లాడారు.

## మూలస్థానేశ్వరాలయంలో మహా శివరాత్రి!

నెల్లూరులోని భువనేశ్వరి సమేత మూలస్థానేశ్వర స్వామి దేవస్థానంలో మహా శివరాత్రి బ్రహ్మోత్సవాలు ఫిబ్రవరి 25వ తేది మొదలై మార్చి 9వ తేది వరకు జరుగుతాయి. మార్చి 2వ తేది రాత్రి 11 గంటలకు లింగోద్భవాభిషేకం జరుగుతుంది. 2వ తేది ఉదయం గిన్నె భిక్ష, 3వ తేది కళ్యాణం, 5వ తేది పులి వాహనం, 6వ తేది అలకలతోపు, 7వ తేది తిరిచ్చి ఉత్సవం, 8వ తేది దవనోత్సవం, 9వ తేది ఏకాంతసేవ జరుగుతాయి. భక్తులు ఈ కార్యక్రమానికి విచ్చేసి జయప్రదం చేయమంటున్నారు దేవస్థానం ఛైర్మన్ రేబాల వెంకటరెడ్డి, కార్యనిర్వహణాధికారి కోవూరు జనార్ధన్‌రెడ్డి.

## కసుమూరు మస్తానయ్య గంధ మహోత్సవం

జిల్లాలో మతాతీతంగా ప్రసిద్ధి చెందిన కసుమూరు మస్తానయ్య దర్గాలో గంధ మహోత్సవం మార్చి 1వ తేది రాత్రి జరుగుతుంది. 2వ తేది ఫాతెహా, 3వ తేది ఈ కార్యక్రమం ముగింపుగా తహలీత్ చేసి ప్రసాదాలు పంచుతారు. వక్ఫ్ బోర్డు నేతృత్వంలో ఈ గంధమహోత్సవం జరుగుతుంది.

## అరుదైన శస్త్రచికిత్స

కావలి పట్టణానికి చెందిన షేక్ కాలేబీ(55) కడుపునొప్పితో బాధపడుతుండగా ఆమె కడుపు నుంచి 15 కిలోల గడ్డను తొలగించి ప్రాణం పోశాడు డాక్టర్ ప్రభాకర్‌నాయుడు. గత కొన్నేళ్లుగా నొప్పితో ఎందరో వైద్యులను సంప్రదించినా నయం కాలేదు. ఈ పరిస్థితులలో ప్రభాకర్‌నాయుడుకు చూపించగా ఆయన శస్త్రచికిత్స చేసి ఈ కణితిని తొలగించారు. స్థానిక గుండెమడుగుల దేవదానం మెమోరియల్ ఆస్పత్రిలో ఈ శస్త్రచికిత్స నిర్వహించారు. అరుదైన చికిత్స చేసిన డాక్టర్ ప్రభాకర్ నాయుడిని పలువురు ఘనంగా సన్మానించారు.

కొరవ 14వ పేజీలో

○ పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటంలా వుంది

# నేతలతో ఉద్యోగులకు కష్టకాలం


గూడూరు ఎమ్పీడిఓ కార్యాలయంలో తనిఖీ చేస్తున్న ఎసిబి ఇన్స్‌పెక్టర్ చంద్రమౌళి.

గతంలో ఎన్నడూలేని విధంగా జిల్లా రాజకీయాల్లో చోటుచేసుకొంటున్న పరిణామాలు, వైరివర్గాన్ని ఇరుకున పెట్టాలన్న లక్ష్యంతో అధికార పార్టీ నేతలు చేస్తున్న ప్రయత్నాలు ఉద్యోగులకు ప్రాణసంకటంగా మారుతున్నాయి. పంచాయితీరాజ్ సంస్థల్లో చోటుచేసుకొంటున్న అవినీతి అక్రమాలను వెలికితీసి జగన్ వర్గాన్ని ముఖ్యంగా జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిని ఇరకాటంలో పెట్టేందుకు అధికార పార్టీ ప్రజాప్రతినిధులు తెరవెనుక యంత్రాంగంతో కార్యాలయాల్లో ఎసిబి అధికారులు చేస్తున్న సోదాలు, జరుపుతున్న దాడులు ఉద్యోగులకు శాపంగా పరిణమిస్తున్నాయి. జడ్పీ కార్యాలయంతోపాటు మండల అభివృద్ధి కార్యాలయాల్లో ఇటీవల ఎసిబి అధికారులు సోదాలు నిర్వహించారు. పొదలకూరు, కలిగిరి, జలదంకి తదితర మండలాల్లో ఈ తనిఖీలు జరిగాయి. గత రెండేళ్లుగా ఉపాధి హామీ పథకంలో పలు చోట్ల అవకతవకలు జరిగిన విషయం తెలిసిన సంగతే. ఈ విషయంలో ఎసిబి అధికారులు క్రొత్తగా బయటపెట్టేది ఏమీలేకపోయినా రాజకీయ కారణాలతో జరుగుతున్న దాడుల పట్ల సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. మరోవైపు విధులు ఎగ్గొట్టి సొంత వ్యాపారాలు చక్కబెట్టుకొంటున్న ఉద్యోగులు, అక్రమంగా టిఏ, డిఏలు వ్రాసుకొంటున్న వారు, ఏళ్ల తరబడి విధులకు హాజరు కాకుండా నెలనెలా జీతాలు తీసుకొంటున్న ఉద్యోగుల భాగోతాలు ఈ సోదాలతో బట్టబయలౌతుండడంతో ఎంకి పెళ్లి సుబ్బి చావుకొచ్చిందన్న చందంలా తమ పరిస్థితి తయారైందని ఉద్యోగులు వాపోతున్నారు. తమకు ఎలాంటి ఇబ్బంది కల్గకుండా వుండేందుకు అధికార పార్టీ నేతలను ఆశ్రయించేందుకు పలు రకాల ప్రయత్నాలు చేసుకొంటున్నారు ఉద్యోగులు.

# స్వచ్ఛంద సేవ చేయాలి


ముప్పవరపు ఫౌండేషన్ నేతృత్వంలో కుట్టు శిక్షణను ప్రారంభించి పరిశీలిస్తున్న బిజెపి నేత వెంకయ్య నాయుడు, గజల్ గాయకుడు శ్రీనివాస్.

పేదలను ఆదుకొనే దానికి స్వచ్ఛంద సంస్థలు ముందుకు రావాలని బిజెపి సీనియర్ నేత ముప్పవరపు వెంకయ్య నాయుడు పిలుపునిచ్చారు. నెల్లూరు సర్దార్ వల్లభాయ్‌పటేల్ నగర్ (స్పిన్నింగ్ మిల్ లేఅవుట్)లో ఇటీవల వెంకయ్య నాయుడు కుటుంబ సభ్యులు స్థాపించిన ముప్పవరపు ఫౌండేషన్ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న విజ్ఞాన వినోద కేంద్రంలో మహిళలకు ఉచిత కుట్టు శిక్షణను ప్రముఖ గజల్ గాయకుడు గజల్ శ్రీనివాస్‌తో కలసి ప్రారంభించారు. స్వచ్ఛంద సంస్థలు ఉదారతను చాటి సమాజ హితం కోసం పనిచేయాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. ముఖ్యంగా మహిళలు ఆర్థిక స్వావలంబన సాధించే దిశగా తమవంతు సహకారం అందించాలన్నారు. ముప్పవరపు ఫౌండేషన్ ఆధ్వర్యంలో ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించడం సంతోషంగా వుందన్నారు. త్వరలో కంప్యూటర్ శిక్షణను నిర్వహించనున్నట్లు ప్రకటించారు. గజల్ శ్రీనివాస్ మాట్లాడుతూ జీవితాంతం మనిషి మనిషిగా జీవించినపుడే సార్ధకత లభిస్తుందన్నారు. అలాంటి వ్యక్తి వెంకయ్యనాయుడని, గ్రామీణులకు, పేదలకు సహాయ సహకారాలు అందిస్తున్న వ్యక్తి వెంకయ్యనాయుడని కొనియాడారు. ఈ సందర్భంగా అందరినీ ప్రేమతో పలకరించుకొంటూ పాడిన గజల్ అందరినీ ఆకట్టుకొంది. ఈ కార్యక్రమంలో ముప్పవరపు ఫౌండేషన్ ట్రస్టీ, వెంకయ్యనాయుడు సతీమణి ఉషమ్మ తదితరులు పాల్గొన్నారు.

# రహదార్లపై మరణ మృదంగం

వరుస ప్రమాదాలు హడలెత్తిస్తున్నాయి

ఇటీవల కాలంలో జిల్లాలో జరుగుతున్న రోడ్డు ప్రమాదాలు ఆందోళన కల్గిస్తున్నాయి. మితిమీరిన వేగం, వాహనం అదుపు తప్పడం, నిద్ర మత్తు కారణం ఏదైనప్పటికీ పెద్ద ఎత్తున జరుగుతున్న ప్రమాదాలు, కోల్పోతున్న ప్రాణాలతో రహదారులు మృత్యుమార్గాలుగా మారుతున్నాయి. కొన్నింటిలో మితిమీరిన వేగం, మరికొన్ని ఘటనల్లో ఏమరపాటు ప్రయాణీకుల ప్రాణాలను గాలిలో కలిసేలా చేస్తున్నాయి. నిత్యం ఏదో ఒక ప్రాంతంలో ముఖ్యంగా జాతీయ రహదారుల్లో యాక్సిడెంట్లు అధికంగా జరుగుతున్నాయి. రహదారులు నెత్తురోడుతున్నా వీటి నివారణకు అధికారులు తీసుకొంటున్న చర్యలు మాత్రం నామమాత్రంగా వుంటున్నాయి. రోజురోజుకు వాహనాల సంఖ్య పెరుగుతున్నా వాటికి అనుగుణంగా రహదారులు లేకపోవడం ఒక కారణం. ఆందోళనకర స్థాయిలో జరుగుతున్న ప్రమాదాలను అరికట్టేందుకు కేంద్ర ప్రభుత్వం జాతీయ స్థాయిలో నిపుణుల కమిటీ ఏర్పాటు చేసినప్పటికీ ఫలితం శూన్యం. వాహనాల వేగాన్ని నియంత్రించడం, నిబంధనలకు విరుద్ధంగా వ్యవహరించే డ్రైవర్ల లైసెన్సులను రద్దు చేయడం, స్పీడ్ బ్రేకర్లు ఏర్పాటు చేయడం, మద్యం తాగి వాహనాలను నడపడాన్ని అరికట్టడం, ప్రధాన కూడళ్లలో డివైడర్ల ఏర్పాటు, తదితర సిఫార్సులను కేంద్రానికి నిపుణుల కమిటీ సూచించినా ఇవెక్కడా అమలు కాకపోవడం, తూతూ మంత్రంగా చర్యలు చేపట్టడంతో రోడ్డు ప్రమాదాలు అధికమవడానికి కారణమని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు.


చెన్నై - కలకత్తా జాతీయ రహదారిపై ప్రమాదానికి గురైన స్కూల్ వ్యాన్.

# గిట్టుబాటు ధరేది?

అల్లాడుతున్న రైతులు


గిట్టుబాటు ధరపై సిపిఎం ఆఫీసులో జరిగిన అఖిలపక్ష సమావేశంలో వివిధ పార్టీల నేతలు.

అధికారులు ఎన్ని చర్యలు చేపడుతున్నా, ఎన్ని హెచ్చరికలు చేస్తున్నా, రైతులకు గిట్టుబాటు ధర లభించకపోగా దళారులు చెప్పిందే చెల్లుబాటు అవుతుండడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. దళారుల బెడద తప్పించడానికి, రైతులకు ప్రయోజనం చేకూర్చేందుకు ప్రభుత్వం జిల్లావ్యాప్తంగా ధాన్యం కొనుగోలు కేంద్రాలను ఏర్పాటుచేసినా వాటి వలన రైతాంగానికి ఒనగూడిందేమీ లేదు. జిల్లాలో మొత్తం 33 ధాన్యం కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేసింది. ఎఫ్‌సిఐ గిడ్డంగుల ద్వారా కొనుగోలు చేసేందుకు చర్యలు చేపట్టడంతోపాటు వ్యవసాయ మార్కెట్ కమిటీ, పౌరసరఫరాల శాఖ, ఇందిర క్రాంతి పథం, వ్యవసాయ శాఖల ఆధ్వర్యంలో ఈ కొనుగోలు కేంద్రాలు ఏర్పాటయ్యాయి. అయితే ప్రభుత్వం విధిస్తున్న నిబంధనలు రైతులకు దడ పుట్టిస్తున్నాయి. ముఖ్యంగా నాణ్యతా ప్రమాణాలు రైతులను బెంబేలెత్తిస్తున్నాయి. ధాన్యంలో 17 శాతం తేమ, దుమ్ము ధూళి, రాళ్లు ఒక్క శాతం, చెత్తాచెదారాలు ఒక శాతం, రంగు మారిన, దెబ్బతిన్న, మొలకెత్తిన, పురుగు తొలచిన ధాన్యం నాలుగు శాతం, పక్వానికిరాని, కుంచించుకపోయిన, వంకర పోయిన ధాన్యం మూడు శాతం, కల్తీ, తరక ఇతర రకాలుగా దెబ్బతిన్నవి ఏడు శాతం వాటికి మాత్రమే అనుమతిచ్చింది. ఎపిసీడ్స్ సరఫరా చేసిన విత్తనాల్లో నకిలీ విత్తనాల కారణంగా తరక గింజలు పది శాతం పైనే వుంటున్నాయి. వరికోత మిషన్లు వచ్చిన తర్వాత ధాన్యం ఆరే పరిస్థితి లేదు. కనీసం తేమ 25 శాతం వుంటోంది. ఈ నేపథ్యంలో ప్రభుత్వం చెప్పే నాణ్యతా ప్రమాణాలు రైతులు పాటించలేని పరిస్థితి ఏర్పడడంతో దళారులు చెప్పిన ధరలకే అమ్ముకొంటున్నారు.

# నిధుల కొరతతో ఆగిన అభివృద్ధి!

## సంక్షేమ పథకాలు నడిచేదెట్లా?

నిధుల కొరత కారణంగా జిల్లాలో అభివృద్ధి, సంక్షేమ పథకాలు నిలిచిపోయాయి. ఆర్థిక సంవత్సరం గడువు మరో నెలలో ముగియనుంది. ఈ క్రమంలో 2010 - 11 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి కేటాయించిన బడ్జెట్ నిధులు జిల్లాకు విడుదల కాకపోవడంతో అధికారులు తలలు పట్టుకొంటున్నారు. ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించిన రచ్చబండ కార్యక్రమానికి వివిధ శాఖలకు చెందిన నిధులు మళ్లించింది. ఆర్థిక సంవత్సరం గడువు ముగియనున్న కారణంగా



లబ్దిదారులకు మంజూరు చేసిన పథకాలివ్వాలని బ్యాంకులు కూడా ఎదురు చూస్తున్నాయి. సంబంధిత శాఖల వద్ద సబ్సిడీ నిధులు లేకపోవడంతో బ్యాంకు అధికారులు కూడా ఏమీచేయలేని పరిస్థితి ఏర్పడింది. ఇప్పటివరకు మంత్రులు, అధికారులు చేసిన ప్రకటనలకు, వాస్తవ పరిస్థితికి పొంతన లేకుండా పోయింది. 2009 - 10 ఆర్థిక సంవత్సరంలో సబ్సిడీ నిధులు విడుదల చేయకపోయినా కొన్ని బ్యాంకులు స్వయం ఉపాధి పథకాల కోసం రుణాలు అందించాయి. గత సంవత్సరానికి సంబంధించిన సబ్సిడీ నిధులు నేటికీ ప్రభుత్వం నుంచి విడుదల కాకపోవడంతో ఈ సంవత్సరం రుణాలు అందించేందుకు బ్యాంకులు నిరాకరించాయి. సంక్షేమ శాఖల అధికారులు కూడా నిధుల కొరత కారణంగా లబ్దిదారులకు సమాధానం చెప్పలేక ఇబ్బంది పడుతున్నారు.

## ఫీజు రీఎంబర్స్‌మెంట్ కోసం

# చకోర పక్షుల్లా మారిన విద్యార్థులు!




విద్యార్థుల ఫీజు రీఎంబర్స్‌మెంట్ జాప్యానికి నిరసనగా నగరంలో ప్రదర్శన చేస్తున్న తెలుగు యువత జిల్లా అధ్యక్షుడు పమిడి రవికుమార్ చౌదరి బృందం.

### ఈ సమస్యకు పరిష్కారమేమిటి?

జిల్లాలో వివిధ ప్రైవేట్ విద్యాసంస్థల్లో చదువుతున్న ఎస్సీ, ఎస్టీ, బిసి, ఇబిసి, మైనార్టీ విద్యార్థులు ఫీజుల కోసం ఎంతో ఆశతో ఎదురు చూస్తున్నారు. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వాన్ని పట్టిపీడిస్తున్న సమస్యల్లో ఫీజు రీఎంబర్స్‌మెంట్ ప్రధానమైనది. రాష్ట్ర ఆర్థిక పరిస్థితుల కారణంగా విద్యార్థులకు చెల్లించాల్సిన ఫీజులను సకాలంలో ప్రభుత్వం చెల్లించలేక పోయింది. గత అక్టోబర్ నెలలో ఫీజులు చెల్లింపు గురించి విద్యార్థులను ఎటువంటి ఒత్తిడికి గురి చేయరాదంటూ అప్పటి ముఖ్యమంత్రి కె.రోశయ్య ఆదేశించారు. ముఖ్యమంత్రి ఆదేశాల ప్రకారం జిల్లా కలెక్టర్లు ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాలకు ఫీజు చెల్లించే విషయంపై లేఖలు కూడా వ్రాయడం జరిగింది. కళాశాలలకు చెల్లించాల్సిన అన్ని రకాల ఫీజులను ప్రభుత్వం తప్పకుండా గడువులోగా చెల్లిస్తుందని భరోసా కూడా ఇచ్చారు.

అయితే ఈ భరోసా ఏమాత్రం ఆచరణలో సాధ్యం కాకపోవడంతోపాటు మరింత కాలయాపన జరిగింది. ప్రస్తుతం విద్యాసంవత్సరం గడువు ముగియనుండడంతో కళాశాల యాజమాన్యాలు ప్రభుత్వం ఫీజులు చెల్లించే పరిస్థితి లేదని విద్యార్థులే ఫీజులు చెల్లించాలని డిమాండ్ చేస్తున్నాయి. ఇందుకు గడువు కూడా విధించాయి. గడువు లోపల ఫీజు రీఎంబర్స్‌మెంట్ జరగని పక్షంలో విద్యాసంస్థలను మూసివేస్తామని హెచ్చరికలు సైతం జారీ అయ్యాయి. సమస్య తీవ్రతమైతే గాని ప్రభుత్వం స్పందించదన్న విషయం అందరికి తెలిసిందే. రాష్ట్ర మంత్రివర్గం సమావేశమై ఎంతో కొంత ఫీజులను చెల్లించేందుకు సిద్ధంగా వున్నట్లు ప్రకటించింది. పరీక్షలు దగ్గర పడుతున్న కొద్ది ప్రభుత్వం ఫీజులు విడుదల చేస్తుందో లేదోనని పేద, బడుగు, బలహీన వర్గాల విద్యార్థులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

విద్యాసంస్థల యాజమాన్యాల హెచ్చరికల నేపథ్యంలో ప్రభుత్వంలో చలనం వచ్చింది. కొన్ని రకాల ఫీజులను చెల్లించేందుకు సిద్ధంగా వున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది.

### విద్యార్థుల ఆందోళన

ఫీజు రీఎంబర్స్‌మెంట్ నిధుల విడుదల కోసం రాష్ట్రవ్యాప్తంగా విద్యార్థి సంఘాలు ఆందోళన కార్యక్రమాలు చేపట్టాయి. ఇందులో భాగంగా జిల్లాలో ఎస్ఎఫ్ఐ, ఎఐఎస్ఎఫ్, టిఎన్ఎస్ఎఫ్, ఎబివిపి తదితర విద్యార్థి సంఘాలు వివిధ రూపాల్లో నిరసన కార్యక్రమాలు చేపట్టాయి. జిల్లాకు చెందిన ఆర్థికశాఖా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నివాసాన్ని ముట్టడించేందుకు తీవ్ర ప్రయత్నాలు కూడా జరిగాయి. ఏసి సెంటర్లో పోలీసులు అడ్డుకోవడంతో అక్కడే మంత్రి దిష్టిబొమ్మను దగ్ధం చేయడం జరిగింది. దీంతో పోలీసులు కొందరు విద్యార్థులను అదుపులోకి తీసుకొని అనంతరం విడిచి పెట్టారు.

విద్యార్థులకు మద్దతుగా విద్యార్థి సంఘాలు, ప్రతిపక్ష రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాల నేతలు ఆందోళన, ధర్నా, రాస్తారోకో కార్యక్రమాల్లో పాల్గొని సంఘీభావం ప్రకటించారు. విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు ఇతర ఫీజులు చెల్లించలేని దుస్థితిలో రాష్ట్ర ప్రభుత్వం వుందని దుయ్యబట్టారు. విద్యారంగానికి అధిక ప్రాధాన్యత నిస్తామని ప్రకటించిన రాష్ట్ర ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రస్తుతం విద్యార్థులకు ఏమి సమాధానం చెబుతారని ప్రశ్నిస్తున్నారు.

జిల్లాలో దాదాపు 84వేల మంది విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు మంజూరు చేయాల్సి వుంది. వీరితోపాటు ఇంజినీరింగ్, మెడికల్, ప్రైవేట్ డిగ్రీ కళాశాలలో చదువుతున్న పేద విద్యార్థులకు ఫీజు రీఎంబర్స్‌మెంట్ మంజూరు చేయాల్సి వుంది.

గత సంవత్సరం నుంచి స్కాలర్‌షిప్‌ల దరఖాస్తులను ఆన్‌లైన్‌లో పొందుపరచాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకు ముందుగా విద్యార్థులకు అవగాహన కల్పించి ఆన్‌లైన్లో పూర్తి సమాచారం నింపేవిధంగా సంబంధిత కళాశాల ప్రిన్సిపాల్స్ కృషి చేయాలని ప్రభుత్వం ఆదేశించింది.

కళాశాల నుంచి విద్యార్థులే ఆన్‌లైన్‌లో దరఖాస్తు నింపాల్సి వుండగా కొన్ని కళాశాలల సిబ్బంది ఈ పనిని తమ భుజాలపై వేసుకొని పొందుపరచడంతో పలు అవకతవకలు చోటు చేసుకున్నాయన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. ఆన్‌లైన్‌లో వుంచిన దరఖాస్తులను సంబంధితశాఖ అధికారులు సమగ్రంగా నేటికీ పరిశీలన జరపలేదన్న విమర్శలున్నాయి. కళాశాల నుంచి దరఖాస్తు చేసిన విద్యార్థులు సంబంధితశాఖ కార్యాలయంలో సంప్రదిస్తే దరఖాస్తులు చేరలేదనో, సక్రమంగా పూర్తి చేయలేదనో సమాచారం వస్తున్నది. దరఖాస్తు చేసే విధానంపై విద్యార్థులకు సరైన అవగాహన లేకపోవడం కూడా లోటుపాట్లకు ఆస్కారం ఏర్పడింది. సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమ శాఖ, వెనుకబడిన తరగతుల సంక్షేమశాఖ, మైనార్టీ సంక్షేమ శాఖల అధికారులు ఆన్‌లైన్ దరఖాస్తులను పరిశీలిస్తున్నారు.

గతంలో ప్రతి విద్యార్థి స్కాలర్‌షిప్‌ల కోసం విడివిడిగా దరఖాస్తు చేసుకొనే విధానం వుండేది. విద్యాసంవత్సరం ప్రారంభమైన తర్వాత రెండు మూడు నెలల్లోగా దరఖాస్తు పూర్తి చేసి సంబంధితశాఖ కార్యాలయాలకు కళాశాలల ప్రిన్సిపాల్స్ పంపేవారు. కార్యాలయంకు వచ్చిన దరఖాస్తులను పరిశీలించి ప్రతి సంవత్సరం జనవరి నెలలో స్కాలర్‌షిప్‌లు ఇతర ఫీజులు మంజూరు చేసేవారు. గత సంవత్సరం నుంచి ఆన్‌లైన్ విధానం ప్రవేశ పెట్టడంతో స్కాలర్‌షిప్‌ల సమస్య మరింత తీవ్రమైంది. రాష్ట్రప్రభుత్వం ఆర్థిక ఇబ్బందుల్లో పడిపోవడంతో ఫీజు రీఎంబర్స్‌మెంటు చెల్లించలేకపోతుంది. వృత్తి విద్యాకళాశాలలో విద్యనభ్యసిస్తున్న వారు వేలాది రూపాయల ఫీజు చెల్లించాల్సి వుంటుంది. ఈ క్రమంలో ప్రభుత్వం నిధులు విడుదల చేయకపోతే జిల్లాకు చెందిన వేలాదిమంది విద్యార్థుల భవిష్యత్ ప్రశ్నార్థకంగా మారే ప్రమాదం వుంది.

ప్రభుత్వ వైఖరి ఇలాగే కొనసాగితే వచ్చే విద్యా సంవత్సరం నుంచి ప్రవేశం కల్పించే సమయంలోనే ఫీజులు వసూలు చేసుకోవాలని ప్రైవేట్ కళాశాలల యాజమాన్యాలు భావిస్తున్నాయి. జిల్లాలో ఇప్పటివరకు రెన్యూవల్స్ బకాయిలు, ఈ విద్యాసంవత్సరం నూతనంగా మంజూరు చేసే స్కాలర్‌షిప్‌లకు ఎన్ని నిధులు అవసరం అవుతాయి అన్న సమాచారం సంక్షేమశాఖల కార్యాలయాల్లో దొరకడం లేదు. ఆన్‌లైన్ ద్వారా వచ్చిన దరఖాస్తులను సమగ్రంగా పరిశీలన జరిపి అవసరమైన నిధులు విడుదల కోసం రాష్ట్ర ప్రభుత్వానికి జిల్లా నుంచి ప్రతిపాదనలు పంపాలి. అసలు అధికారులు ఏవిధమైన ప్రతిపాదనలు పంపారన్నది కూడా అనుమానాలు వ్యక్తమవుతున్నాయి.

ప్రభుత్వం ఫీజులు విడుదల చేస్తుందని ఎంతో ఆశతో ఇప్పటివరకు ఎదురు చూసిన విద్యార్థులు, వారి తల్లిదండ్రులు ప్రభుత్వం, విద్యాసంస్థల యాజమాన్యాలు పరస్పరం చేసుకొంటున్న హెచ్చరికలను చూసి మానసికంగా ఆందోళన చెందుతున్నారు. తమ బిడ్డల చదువు మధ్యలో నిలిచిపోతే పరిస్థితి ఏమిటని ప్రశ్నించుకుంటున్నారు. జిల్లాతోపాటు రాష్ట్ర వ్యాప్తంగా ఫీజు రీఎంబర్స్‌మెంటు బకాయిల విడుదలకు విద్యార్థిలోకం గళమెత్తింది. వెంటనే ఫీజు బకాయిలు విడుదల చేయకపోతే ఆత్మహత్యలే శరణ్యమంటున్నాయి కొన్ని విద్యార్థి సంఘాలు.



జిల్లాలో అభివృద్ధి కార్యక్రమాల అమలు విషయమై వివిధ ప్రభుత్వ శాఖాధికారులతో సమీక్షా సమావేశం జరుపుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్.



శాసనమండలి ఎన్నికల కౌంటింగ్ విషయమై కలెక్టరేట్‌లో ఉద్యోగుల సందేహాలు తీరుస్తున్న ఎన్నికల కమిషన్ కన్సల్‌టెంట్ రామబ్రహ్మం.




అమెరికాలో నవ్వుల హరివిల్లు ప్రదర్శన ఇచ్చి నెల్లూరు తిరిగి వచ్చిన తెలుగుదేశం పార్టీ సాంస్కృతి విభాగం అధ్యక్షుడు, హాస్యనటుడు దోర్నాల హరిబాబును సన్మానిస్తున్న తెలుగునేతలు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, వెంకటస్వామినాయుడు, వాణి తదితరులు.




పల్స్‌పోలియో కార్యక్రమం అమలుపై జిల్లా టాస్క్ ఫోర్స్ కమిటీ సభ్యులతో ఏర్పాటు చేసిన సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య. ప్రక్కన జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి వెంకటరమణారెడ్డి. వైద్య విధాన పరిషత్ జిల్లా కో ఆర్డినేటర్ డాక్టర్ నిర్మలమ్మ.

# ఉపాధిహామి నిధుల భోక్తలపై వేటు!

● ఎపిడి ప్రసాద్‌రావు ప్రకటన

సీతారాంపురం మండలంలో జరిగిన ఉపాధిహామీ పనుల్లో అవకతవకలు జరిగిన విషయం సామాజిక తనిఖీల్లో వెల్లడైన విషయం తెలిసింది. ఈ అక్రమాలకు పాల్పడిన సిబ్బందిని సస్పెండ్ చేస్తున్నట్లు ఎపిడి ప్రసాదరావు తెలిపారు. ఈ మేరకు జిల్లా కలెక్టర్ రాంగోపాల్ ఉత్తర్వులిచ్చారని తెలిపారు. ఉపాధిపనుల్లో మొత్తం 13,32,996 రూపాయలు దుర్వినియోగం అయినట్లు గుర్తించామని, ఇందులో 73వేల రూపాయలను రికవరీ చేశామన్నారు. మిగిలిన 12లక్షల రూపాయలను రికవరీ చేసేందుకు చర్యలు చేపడుతున్నట్లు చెప్పారు. బాలాయపల్లి పంచాయితీలో నలుగురిని, నెమళ్లదిన్నె పంచాయితీలో నలుగురిని తొలగించామన్నారు. సాంకేతిక సహాయకుడిని సస్పెండ్ చేశామన్నారు. చిన్నంపల్లి, దేవమ్మ చెరువు, బసినిపల్లె, పోలంగారిపల్లె, జయపురం, పబ్బులేటిపల్లె, సీతారాంపురంలో జరుగుతున్న వివిధ పనులను క్వాలిటీ కంట్రోల్ అధికారులు తనిఖీ జరపాలని కలెక్టర్ ఆదేశించినట్లు ఎపిడి తెలిపారు.

## అక్రమాలకు పాల్పడితే చర్యలు

అంగన్‌వాడీ కేంద్రాల్లో పనిచేసే సిబ్బంది అక్రమాలకు పాల్పడితే చర్యలు తప్పవని ఐసిడిఎస్ ప్రాజెక్టు డైరెక్టర్ శారద హెచ్చరించారు. కావలి మండలంలో ఐసిడిఎస్ పరిధిలో గల అంగన్‌వాడీ కేంద్రాల పనితీరును ఆమె పరిశీలించారు. ఈ సందర్భంగా ఆమె సిబ్బందినుద్దేశించి బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించాలని, అవకతవకలకు

ఐసిడిఎస్ ప్రాజెక్ట్ డైరక్టర్ హెచ్చరిక

పాల్పడితే ఉపేక్షించేది లేదన్నారు. కార్యకర్తలు, ఆయాల పని తీరులో మార్పు రాకపోతే ఇంటికి పంపిస్తామని తీవ్ర హెచ్చరికలు జారీ చేశారు. అంగన్‌వాడీ కేంద్రాలు సక్రమంగా నడవడం లేదని, పౌష్టికాహారం దుర్వినియోగం అవుతున్నట్లు ఫిర్యాదులొస్తున్నాయని వీటన్నింటిపై విచారణ జరుపుతామన్నారు.

## పల్లెల్లో అంధకారం

● అప్పుడే ఆరంభమైన కరెంట్ కష్టాలు

గ్రామీణ ప్రాంతాల్లోని ప్రజలను కరెంటు కష్టాలు వెన్నాడుతున్నాయి. రాష్ట్రంలో విస్తారంగా వర్షాలు కురిసినా పల్లెల్లో విద్యుత్ కోత ప్రజలను తీవ్ర ఇబ్బందులకు గురి చేస్తున్నది. ముఖ్యంగా కావలి డివిజన్‌లో ఈ సమస్య అధికంగా వుంది. కావలి పట్టణంతోపాటు గ్రామాల్లో విద్యుత్ కోత తీవ్రంగా వుంది. విద్యుత్ అధికారులు చెప్పున్న మాటలకు, చేతలకు పొంతన లేకుండా పోతుంది. వేసవి కాలం ప్రారంభంకాక ముందే ఎడాపెడా విద్యుత్ కోత విధిస్తుండడాన్ని చూస్తున్న ప్రజలు ఎండాకాలంలో ఇంకెంతగా కోత వుంటుందోనని ఆందోళన చెందుతున్నారు. బోగోలు, దగదర్తి, కావలి, అల్లూరు, జలదంకి మండలాల్లో ఈ సమస్య అధికంగా వుంది. ఎప్పుడు కరెంటు పోతుందో, ఎప్పుడు కరెంటు వస్తుందో తెలియక అయోమయం నెలకొంటోంది. ఈ పరిస్థితులను దృష్టిలో వుంచుకొని విద్యుత్ కోతను తొలగించాలని డిమాండ్ చేస్తున్నారు ప్రజలు.

## ఉద్యోగాల పేరుతో టోకరా?

● ప్రసన్న అనుచరుల వ్యాపారం

ఉద్యోగాల పేరుతో టోకరా వేస్తూ పలువురు నిరుద్యోగులను మోసం చేసి డబ్బులు దండుకునే చోటారాయుళ్లు ఇందుకూరుపేట మండలంలో అధికం అయ్యారు. ఎమ్మెల్యే, ఎంఎల్‌సిల వెంట తిరిగే చోటాలు కొందరు ఉద్యోగాలనిప్పిస్తామంటూ నిరుద్యోగుల వద్ద నుంచి పెద్ద మొత్తంలో డబ్బులు దండడం మండలంలో కలకలం రేపింది. ఇద్దరు చోటా నేతలు ఇందులో ఘటికులట. అంగన్‌వాడీ ఉద్యోగాలు ఇప్పిస్తామని, తమ మాటంటే ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి కాదనేది లేదంటూ పలువురి వద్ద నుంచి వసూళ్లు చేయడం అధికం అయ్యింది. ఇది ఆనోట ఈనోట ప్రసన్నకుమార్‌రెడ్డి దృష్టికి పోవడంతో ఆయన ప్రజలకు ఇలాంటి వారి మాటలు విని మోసపోవద్దని బహిరంగంగా ప్రకటించాల్సి వచ్చింది. ఈ ఇద్దరిలో ఒకరు దేశం, మరొకరు కాంగ్రెస్ పార్టీ వారు కావడం విశేషం. ఎమ్మెల్యే ప్రకటనతో ఖంగుతిన్న వీరు చల్లగా జారుకొన్నారు.

# ఆదాల బుట్టలో తెలుగుదేశం నేతలు

మారుతున్న సర్వేపల్లి రాజకీయం



సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి తన నియోజకవర్గంలో తెలుగుదేశం నేతలను ఆకర్షించే పనిలో విజయం సాధించాడనే చెప్పాలి. తోటపల్లి గూడూరు మండలం వరిగొండ గ్రామానికి చెందిన కామిరెడ్డి పెదబాబిరెడ్డి తెలుగుదేశం పార్టీకి బలమైన నేత. అనుచరగణం, ఓట్లు సాధించే సత్తా వుండడంతో బాబిరెడ్డికి మంచి బలం వుంది. అధికారుల చేత పనులు చేయించుకోవడంలోనూ, పార్టీలకు అతీతంగా సహాయపడడంలోనూ మంచి పేరు సంపాదించుకొన్నాడు. గ్రామంలో సర్పంచ్, ఇద్దరు ఎంపిటిసిలను గెలిపించుకొని టిడిపికి కొండంత అండగా వున్న బాబిరెడ్డి ఆదాల మార్కు రాజకీయాలకు ఆకర్షితుడై కాంగ్రెస్ కండువా కప్పుకోవడం సంచలనం కల్గించింది. ఇటీవల జరిగిన రచ్చబండ కార్యక్రమం సందర్భంగా ఈ తంతు ముగిసింది. బాబిరెడ్డి ఆదాలకు దగ్గరవుతున్నాడని సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డికి తెలిసినా ఎందుకనో గమ్మునుండి పోవడం కార్యకర్తలకు ఆశ్చర్యం కల్గిస్తోంది. వివిధ పనులు కావాల్సి వుండడం, తన వర్గం వారిని కాపాడుకోవలసిన అవసరం ఏర్పడడం వలనే బాబిరెడ్డి ఆదాల పంచన చేరాడని పలువురు విశ్లేషిస్తున్నారు. ఆయన తనతోపాటు మరో దేశం నేత, తన సోదరుడైన కోడూరు చిన బాబిరెడ్డిని తీసుకొని పోయి కాంగ్రెస్ కండువా కప్పించడం వెనుక పెద్ద మంత్రాంగమే నడిచిందని మండల ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

● అభివృద్ధి పథంలో

# వెంకటగిరి

వెంకటగిరి పట్టణం మునిసిపాలిటీగా మారిన తర్వాత దశ మారింది. సమీపంలో బెల్ పరిశ్రమ రావడంతో మరింతగా అభివృద్ధి వైపు అడుగులు వేస్తుంది. భూముల ధరలు పెరిగాయి. ఈ పరిస్థితులలో పట్టణంలో ఒక్కసారిగా కార్పొరేట్ విద్యాసంస్థలు తమ విద్యాసంస్థలను ఏర్పాటు చేస్తుండడం విశేషం. నారాయణ జూనియర్ కళాశాల, శ్రీచైతన్య హైస్కూల్, భాష్యం విద్యాసంస్థలు రానున్నాయి. దీనికి సంబంధించి ఫ్లెక్సీలు ప్రజలను ఆకర్షిస్తున్నాయి. ఈ సందర్భంగా మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి విద్యాభివృద్ధికి చేసిన కృషిని గుర్తుచేసుకోవాలి. మిని యూనివర్శిటీకి కృషి చేసిన ఆయన విద్యాసంస్థలన్నీ ఒకే ప్రాంగణంలో వుండాలని తలచి వెంకటగిరి క్రాస్‌రోడ్స్ వద్ద భూమిని కేటాయించారు. ముఖ్యమంత్రిగా వున్న సమయంలో రాష్ట్రంలో ఎక్కడా లేని విధంగా ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ హ్యాండ్‌లూమ్ టెక్నాలజీని (ఐఐహెచ్‌టి) తీసుకొచ్చారు. గురుకుల పాఠశాల, జూనియర్ కాలేజి, చీనీ నిమ్మ పరిశోధనా కేంద్రం ఏర్పాటు చేశారు. నేదురు మల్లి రాజ్యలక్ష్మి మంత్రిగా పట్టణంలో కస్తూరిబా పాఠశాల, ఎంపి చింతా మోహన్ 2007లో కేంద్రీయ విద్యాలయాన్ని తీసుకవచ్చారు. గతంలో విద్యాదాత బివి నరసింహరావు తదితరులు 1968లో విశ్వోదయ కళాశాలను నిర్మించారు. ప్రభుత్వ ఐటిఐ ఎంతగానో దోహద పడింది. ఈ నేపథ్యంలో ఇప్పుడు కార్పొరేట్ విద్యాసంస్థలు వెంకటగిరిలో వెలుస్తుండడం విద్యాభివృద్ధికి దోహదం చేస్తాయని చెప్పాలి.

● వెంకటగిరిలో

# విద్యార్థుల ధర్నా!

ఫీజు రీఎంబర్స్‌మెంట్, స్కాలర్‌షిప్‌ల మంజూరులో జాప్యాన్ని నిరసిస్తూ ఆంధ్రప్రదేశ్ బిసి సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో వెంకటగిరిలో నిరసన కార్యక్రమం చేపట్టారు. విద్యార్థులు తరగతులు బహిష్కరించి పట్టణంలోని వీధుల గుండా ప్రదర్శన నిర్వహించి తహశీల్దార్ కార్యాలయం ఎదుట ధర్నాకు దిగారు. రాష్ట్ర ప్రభుత్వం విద్యార్థులకు చెల్లించాల్సిన ఫీజులు, స్కాలర్‌షిప్‌ల విషయమై నిర్లక్ష్యవైఖరి అవలంభిస్తోందని నేతలు విమర్శించారు. తక్షణం వీటిని మంజూరు చేయాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో బిసి సంక్షేమ సంఘం రాష్ట్ర కార్యదర్శి రమాకాంత్, ఆదిశంకర విద్యాసంస్థల అధినేత వంకి పెంచలయ్య, లోక్‌సత్తా పట్టణ అధ్యక్షుడు మల్లేశ్వరరావు, విఆర్‌జెసి కరస్పాండెంట్ డాక్టర్ సురేష్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.

# ముత్తుకూరు రోడ్లు ధ్వంసం

## అధిక లోడు వాహనాలే కారణం

కృష్ణపట్నం ఓడరేవు, అనుబంధ పరిశ్రమల ఏర్పాటుతో ముత్తుకూరు మండలంలో అభివృద్ధి జరుగుతున్నా రహదారులు మాత్రం పూర్తిగా ధ్వంసమైపోయాయి. ఆయా పరిశ్రమలకు అవసరమైన సామగ్రిని తీసుకొని వస్తున్న వాహనాలు సామర్థ్యానికి మించి అధిక లోడ్‌తో తిరుగుతుండడంతో రోడ్లు దెబ్బతిని పోతున్నాయి. ముడి ఖనిజం, ఇతరత్రా ఫ్యాక్టరీలకు అవసరమైన వాటిని తీసుకొని వస్తున్న వాహనాల కారణంగా మండలంలోని పలు ప్రాంతాల రోడ్లతోపాటు వెంకటాచలం మండలంలోని రోడ్లు పూర్తిగా ఛిద్రమైపోయాయి. ముత్తుకూరు, వెంకటాచలం, పంటపాళెం, బలిజపాళెం, ముత్తుకూరు శివారు ప్రాంతాలలో రోడ్లు గుంటలు మిట్టలుగా మారిపోయాయి. ముత్తుకూరు మండలంలోని పోలంరాజుగుంట, దమ్మాయిపాళెం, దువ్వూరువారిపాళెం, రామాపురం గ్రామంలోని రోడ్ల పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. అధికలోడ్‌తో వాహనాలు తిరుగుతూ రోడ్లను ధ్వంసం చేస్తున్నా అధికారులు పట్టించుకోకపోవడంతో ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురికావల్సి వస్తోంది.

# వెటరన్ క్రీడల్లో పతకాల పంట

## బోగోలు రాజేశ్వరి ఘనత




బోగోలు మండలం బిట్రగుంటకు చెందిన జె.రాజేశ్వరి అథ్లెటిక్స్‌లో అద్వితీయమైన ప్రతిభ కనబరిచింది. మద్రాసులో ఇటీవల జరిగిన సౌత్‌జోన్ వెటరన్ అథ్లెటిక్స్ క్రీడల్లో 400 మీటర్ల పరుగు పందెంలో ప్రథమస్థానం సాధించింది. అలాగే 5కి.మీ నడక పోటీల్లోనూ ఆమెదే ప్రథమ స్థానం. షాట్‌పుట్‌లోనూ తృతీయస్థానం సాధించడం విశేషం. రాజేశ్వరి గత ఏడాది జరిగిన రాష్ట్రస్థాయి వెటరన్ క్రీడల్లోనూ 100 మీటర్ల పరుగు పందెంలో బంగారు పతకం సాధించడం ఆమె ప్రతిభకు నిదర్శనం. వివిధ పోటీల్లో ప్రతిభ కనబరుస్తూ మండలం పేరు నిలుపుతున్న ఆమె తనను ప్రోత్సహిస్తున్న ఎస్‌వి.కృష్ణ, ఉపాధ్యాయుడు వెంకటేశ్వర్లుకు కృతజ్ఞతలు చెప్పింది.

# పురుగుల భోజనం

## ⇨ గంగపట్నం హైస్కూల్‌లో స్పెషల్ మెను ⇦

ఇందుకూరుపేట మండలం గంగపట్నం జిల్లా పరిషత్ హైస్కూల్ విద్యార్థులు పురుగుల అన్నం తినలేక అల్లాడి పోతున్నారు. మధ్యాహ్న భోజనాన్ని అందించే నిర్వాహకురాలు నాసిరకంగా ఆహారాన్ని అందిస్తుండడంతో పిల్లలకు తీవ్ర ఇబ్బందులు ఎదురౌతున్నాయి. అన్నంలో పురుగులు వస్తుండడంతో వాటిని తినలేక, అలాగని పస్తులుండలేక అల్లాడుతున్నారు విద్యార్థులు. ఈ విషయం పాఠశాల ప్రధానోపాధ్యాయుడు, సిబ్బందికి తెలిసినా భోజన నిర్వాహకురాలు నోటిదురుసు మనిషి కావడంతో వారు ఆమె దెబ్బకు హడలిపోతున్నారు. పురుగులన్నం అని తెలిసినా నిలువరించలేక పోతున్నారు. విద్యార్థులను సైతం నిర్వాహకురాలు భయపెడుతోందట. గ్రామస్తులకు తెలిసినా రాజకీయ కారణాల వల్ల ఎవరూ ప్రశ్నించకపోవడంతో విద్యార్థులు కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు. మండల విద్యాశాఖ అధికారులైనా స్పందించి నాసిరకం ఆహారాన్ని అందించే భోజన నిర్వాహకురాలిపై చర్యలు చేపట్టాలని, పిల్లలకు మంచి ఆహారం అందేలా చూడాలని పలువురు కోరుకొంటున్నారు.




మాతృభాషా దినోత్సవాన్ని పురస్కరించుకొని భాషాభివృద్ధికి కృషి చేసిన ఆచార్య ఆదిత్యను నెల్లూరు తిక్కన రచయితల సంఘం తరఫున సన్మానిస్తున్న భవానీ నాగేంద్రప్రసాద్. ప్రక్కన శేషయ్య నాయుడు, మురళీమోహన్, ఈశ్వర్, సుభద్రాదేవి.

# ధాన్యం కొనుగోలు కేంద్రాల వద్ద నిరసన!

పౌరసరఫరాలశాఖ ఆధ్వర్యంలో జిల్లావ్యాప్తంగా పలు మండలాల్లో ఏర్పాటైన ధాన్యం కొనుగోలు కేంద్రాల పట్ల రైతులు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఇందుకూరుపేటలో ఏర్పాటు చేసిన ఈ కేంద్రం ప్రారంభం సందర్భంగా విచ్చేసిన రైతులు అధికారులను ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేశారు. పౌరసరఫరాలశాఖ అసిస్టెంటు మేనేజర్ పుల్లంశెట్టి, వ్యవసాయాధికారిణి కమల కేంద్రాన్ని ప్రారంభించి మాట్లాడుతూ 17శాతం తేమకు అనుమతిస్తామని, సాధారణ రకం ధాన్యాన్ని క్వింటాల్ 1000 రూపాయలకు, ఎ గ్రేడ్ రకాన్ని క్వింటాల్ 1030 రూపాయలకు కొనుగోలు కేంద్రాల ద్వారా అమ్ముకోవచ్చని తెలిపారు. దీంతో అక్కడకు వచ్చిన రైతు సంఘం జిల్లా అధ్యక్షుడు గంగపట్నం రమణయ్య,

## అధికారులను నిలదీసిన రైతులు

జెజేపేట రైతులు పరంధామయ్య, లక్ష్మీనారాయణ, గోపాల్ తదితరులు అధికారులపై ప్రశ్నల వర్షం కురిపించారు. పేరుకు జిల్లాలో 33 కొనుగోలు కేంద్రాలను ఏర్పాటుచేసినా రైతుల నుంచి చిట్టెడు ధాన్యాన్ని కొనుగోలు చేయలేక పోతున్నారని, లోడింగ్ అన్‌లోడింగ్ చార్జీల వలన రైతులకు భారం తప్ప ప్రయోజనం లేదన్నారు. రైతులను కేంద్రాల గురించి చైతన్యపరచడంతోపాటు మిల్లర్లను అదుపులో వుంచాలని, నిబంధనలు సడలించి గోతాలను తక్కువ ధరకు రైతులకు అందివ్వాలని, డ్రయ్యర్లు ఏర్పాటు చేయాలని పలు డిమాండ్లు చేశారు. రైతుల ప్రశ్నలు, డిమాండ్ల ధాటికి ఉక్కిరి బిక్కిరైన అధికారులు రైతులను శాంతింపజేసేందుకు నానాతంటాలు పడాల్సి వచ్చింది. తహశీల్దార్ రామకృష్ణ, ప్రసాద్‌రెడ్డి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

# రాజకీయాలకు అతీతంగా అభివృద్ధి

కావలి ఎమ్మెల్యే బీద ప్రకటన

అభివృద్ధి విషయంలో పార్టీలకు అతీతంగా కృషి చేస్తామని కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు స్పష్టం చేశారు. ఇటీవల ముగిసిన రచ్చ బండ కార్యక్రమంలో పాల్గొనడంపై వస్తున్న విమర్శలకు స్పందిస్తూ కాంగ్రెస్ ప్రభుత్వం అమలు చేస్తున్న రచ్చబండ కార్యక్రమంలో పాల్గొనడంపై విమర్శలు రావడాన్ని పట్టించుకోనన్నారు. స్వప్రయోజనాల కోసం మంత్రి రామనారాయణరెడ్డితో కలసి తిరుగుతున్నాననడం తప్పన్నారు. పేదరికం నుంచి వచ్చిన తనకు పేదల కష్టాలు తెలుసునని, అందుకోసం పేదలకు మరింతగా అభివృద్ధి ఫలాలు అందించాలన్న లక్ష్యంతో పార్టీలకు అతీతంగా ప్రజాసమస్యలు పరిష్కారం, అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొంటానని తెలిపారు. ఎన్నికల సమయంలో మాత్రమే పార్టీలని మిగతా సమయాల్లో అభివృద్ధి, ప్రజా సంక్షేమమే ముఖ్యమని బీద స్పష్టం చేశారు.

## కాటన్ బ్యాగుల పంపిణీ

ప్లాస్టిక్ బ్యాగుల వలన పర్యావరణానికి కలిగే ముప్పును తెలియజేస్తూ వాటి వాడకాన్ని నిలిపి వేయాలని కోరడంతోపాటు ప్రజల్లో అవగాహన కల్పించే విధంగా వెంకటగిరి పట్టణంలో సత్‌సేవా సంఘ్ గత కొంతకాలంగా పలు కార్యక్రమాలు చేపడుతోంది. దీనిలో భాగంగా సంస్థ ఆధ్వర్యంలో ప్రజలకు కాటన్ బ్యాగులను పంపిణీ చేశారు. నగరంలో ప్లాస్టిక్ కవర్ల వాడకాన్ని నిలిపివేయాలని కోరుతూ ముందుగా ర్యాలీ నిర్వహించారు. సంస్థ అధ్యక్షుడు ఆములూరు కృష్ణారావు మాట్లాడుతూ పర్యావరణ పరిరక్షణలో భాగంగా ఈ కార్యక్రమాన్ని చేపడుతున్నట్లు తెలిపారు.

## బొత్సా అలక... ధర్మాన దూరం!!



ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి వైఖరిపై మంత్రులు బొత్సా సత్యనారాయణ అలక వహించి వుండగా ధర్మాన ప్రసాదరావు దూరంగా వుంటున్నారు. శాసనసభలో ప్రతిపక్షాలు దాడి చేసినప్పుడల్లా బొత్సా, ధర్మాన ఎదురు దాడికి దిగేవారు. వై.ఎస్, రోశయ్యలు సిఎంగా వున్నప్పుడు వీరిద్దరూ ఎంతో క్రియాశీలకంగా వ్యవహరించారు. అయితే కిరణ్‌కుమార్‌రెడ్డి తమకు అప్రధానశాఖలు కేటాయించడమే గాక, రాజకీయ వ్యవహారాల్లో తమను సంప్రదించకుండా దూరంగా వుంచుతున్నాడని వీరిద్దరూ కుతకుత లాడుతున్నారు. అత్తమ్మ కొట్టినందుకు కాదు తోడికోడలు నవ్వినందుకన్నట్లు కిరణ్ తమను నిర్లక్ష్యం చేయడమే కాకుండా మంత్రులు రఘువీరా, రామనారాయణరెడ్డిని భుజానికెత్తుకుంటున్నాడన్నది వారి అసంతృప్తికి మరో కారణం. దీంతో శాసనసభలో ప్రభుత్వం ఇరకాటంలో పడినప్పుడు కూడా బొత్సా, ధర్మాన మిన్నకుండిపోతున్నారు. కిరణ్ ఎలా నెట్టుకొస్తాడో వేచి చూడాల్సిందే!!




## బాబు 'మకతిక'



తెలంగాణ వ్యవహారంలో చంద్రబాబు వ్యవహరిస్తున్న తీరు తెలుగుదేశంలో గందరగోళానికి దారితీస్తోంది. ప్రత్యేక తెలంగాణ ఏర్పాటుకు బాబు మొదటి నుంచి వ్యతిరేకంగానే వున్నాడు. అయితే బయటపడి మాట్లాడితే తెలంగాణలో ఇబ్బంది ఏర్పడుతుందని లౌక్యంగా వుంటున్నాడు. తెలంగాణ వాదం ముదిరి పాకాన పడుతుండటంతో 'బాబు' ఓ అడుగుముందుకేసి సీమాంధ్ర ఎమ్మెల్యేల్ని ఉసికొల్పుతున్నాడు. తెలంగాణ ఏర్పాటుకు శాసనసభలో తీర్మానం పెట్టించడానికి వ్యూహరచన చేస్తున్నాడు. ఒక వేళ శాసనసభలో తీర్మానం పెడితే తెలుగుదేశం శాసనసభ్యులు వ్యవహరించాల్సిన తీరుపై 'విప్' జారీ చేయాల్సి వుంటుంది. ఈ 'విప్' తీర్మానానికి అనుకూలంగా జారీ చేయకతప్పని పరిస్థితి. విప్‌ను ధిక్కరిస్తే శాసనసభ్యులపై అనర్హత వేటు పడుతుంది. అందుకే తీర్మానంపై ఎమ్మెల్యేలు ఆత్మరక్షణలో పడేలా ఓటు వేస్తారంటూ బాబు తనకు దగ్గరివాడైన పయ్యావుల కేశవ్ ద్వారా పత్రికా ప్రకటన ఇప్పించాడు. దీంతో బాబు కుట్రను అర్థం చేసుకున్న తెలంగాణ తమ్ముళ్లు ఎదురు దాడికి దిగుతున్నారు. నాగం అయితే పార్టీలో ఆగం చేస్తున్నాడు. దీంతో నాలుక కరుచుకున్న చంద్రబాబు క్రమశిక్షణగా వ్యవహరించాలంటూ కొరడా ఝళిపిస్తున్నాడు. మొత్తానికి తెలంగాణ వ్యవహారం 'బాబు' మకతికను బయటపెడ్తోందంటూ తెలుగు తమ్ముళ్లు చెవులు కొరుక్కుంటున్నారు.

## మసకబారిన జగన్ దీక్ష



ఫీజు పోరు పేరుతో జగన్ చేపట్టిన వారంరోజుల దీక్ష లక్ష్యదిశలో చతికిల బడింది. ఈ వారం రోజుల్లో విద్యార్థులు చలో అసెంబ్లీ, రెండు రోజులు తెలంగాణ బంద్ జరగడంతో జగన్ దీక్షను పట్టించుకున్న వారు కరువయ్యారు. సాధారణంగా నాలుగైదు రోజులపాటు దీక్ష చేస్తే ప్రభుత్వం తరపున మంత్రులు రాయబారులుగా వచ్చి సర్దిచెప్పడం ఆనవాయితీ. అయితే జగన్ విషయంలో మాత్రం ప్రభుత్వం ఏమాత్రం పట్టించుకోలేదు. జగన్ ఆరోగ్య పరిస్థితిని తెలుసుకోడానికి కనీసం డాక్టర్‌ను కూడా పంపించకుండా తమాషా చూస్తూ వుండిపోయింది. ఇక నగరంలో పోలీసుల గస్తీ ఎక్కువ కావడం, బంద్ సందర్భంగా రాకపోకలు లేకపోవడంతో జగన్‌కు సందర్శకులు కూడా కరువై ఫీజుపోరు మసకబారింది. పాపం జగన్ వ్రతం చెడ్డా... ఫలితం కూడా దక్కలేదు...



## ఖజానా విలవిల...



రాష్ట్ర ఖజానా ఖాళీ అయింది. అవసరాలకు నిధుల్లేక ఖజానా విలవిల్లాడుతోంది. బిల్లులు చెల్లించడానికి ఆంక్షలు వుండటంతో ట్రెజరీలు వెలవెలబోతున్నాయి. దీనికితోడు తెలంగాణ ప్రాంతంలో ఆందోళనలు, సహాయనిరాకరణ బంద్‌లు ఎక్కువ కావడంతో ఖజానాకు చేరాల్సిన కోట్లాది రూపాయలకు గండిపడుతోంది. జీతాలు మినహా ఇతరత్రా బిల్లుల్ని చెల్లించొద్దంటూ ప్రభుత్వం చేతులెత్తేసింది. ఈ నేపథ్యంలో ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డి లక్షా 21వేల కోట్ల రూపాయల వార్షిక బడ్జెట్‌ను శాసనసభలో ప్రవేశపెట్టారు. ఖజానాకు చిల్లుపడినా పట్టించుకోకుండా ఆర్థికమంత్రి ఆడంబరానికిపోయి ఆచరణ సాధ్యం కాని బడ్జెట్ ప్రవేశపెట్టడం పట్ల కాంగ్రెస్ ఎమ్మెల్యేలు సైతం పెదవి విరుస్తున్నారు. గతంలో కూడా లక్షకోట్లు దాటిన సందర్భాల్లో వాస్తవంగా ఖర్చుపెట్టింది 70శాతానికి కూడా మించకపోవడాన్ని వీరు గుర్తు చేస్తున్నారు.

## ది వాయిస్ ఆఫ్ న్యూసెన్స్



రాష్ట్ర చేనేత మంత్రి శంకర్రావు నోరు అదుపు తప్పుతుండటం కాంగ్రెస్‌కు తలనొప్పిగా మారింది. రాష్ట్ర పోలీసుల దగ్గర నుంచి జగన్ వ్యవహారాల దాకా శంకర్రావు చేస్తున్న విమర్శలకు అడ్డూ అదుపు లేకుండా పోతోంది. బాధ్యత గల మంత్రిగా వుంటూ ఈ రకంగా వ్యవహరించడం ముఖ్యమంత్రికి కూడా తలనొప్పిని తెప్పిస్తోంది. శంకర్రావు కనబడితే చాలు ఎమ్మెల్యేలు ముఖం చాటేస్తున్నారు. శాసనసభ లాబీల్లో శంకర్రావు గురించి పలువురు ఎమ్మెల్యేలు జోకులు కూడా వేసుకుంటున్నారు. శంకర్రావు మీడియా పాయింట్‌కు వెళ్లగానే వాయిస్ ఆఫ్ న్యూసెన్స్ ఇక మొదలంటూ చెవులు కొరుక్కుంటున్నారు. వింటున్నారా! శంకర్రావు!!

# పరమోత్తమం మాఘస్నానం

అన్ని మాసాల్లో కల్లా మాఘ మాసానికి విశిష్ట ప్రాధాన్యత వుంది. ఈ మాసంలో నదీనదాల్లో చేసే స్నానానికి ఎంతో పవిత్రత వుంది. ఈ స్నానాలనే మాఘస్నానం అంటారు. సాధారణంగా నీటికి గల శక్తులు పరమపావనమైనవి. కల్మషాలు, మలినాలను కడిగివేయడంతోపాటు దాహాన్ని తీర్చేది నీరు. జలం మానవులకు ఎంతో ఉపయుక్తమైనది. సాధారణ స్నానం దేహాన్ని శుద్ధి చేసి ప్రకోపాన్ని తగ్గించి శాంతాన్ని స్థిరత్వాన్ని కల్గిస్తుంది. స్నానం నిత్యవిధి. అలాంటి స్నానాలను నిత్యస్నానం, నైమిత్తిక స్నానం, కామ్య స్నానం, క్రియాంశ స్నానం, అభ్యంగన స్నానం, క్రియా స్నానం అనే ఆరు రకాలుగా చెప్పబడుతుంది. మిగతా మాసాల్లో కల్లా వైశాఖం, కార్తీకం, మాఘమాసాల్లో చేసే స్నానాలు ప్రత్యేక ఫలితాలను ఆశిస్తూ ఆచరించే స్నానాలు.

చంద్రుడు మాఘ నక్షత్రాన వుండే మాసం మాఘమాసం. మాఘం అంటే యజ్ఞం. కళ్యాణ కారకమైన స్నానం పరమ పవిత్రం. పాప రాహిత్యం కోసం నదీస్నానాలు చేయడం మాఘమాస ప్రత్యేకం. ఈ మాసంలో సూర్యుడి గమనాన్ని బట్టి ప్రత్యూష కాలంలో సూర్యకిరణాలు ఒక ప్రత్యేక కోణంలో భూమిని చేరుతాయి. ఆ కిరణాలలో గల అతినీలలోహిత, పరారుణ కిరణాలు నదులు, తటాకాల్లోని నీటిపై ప్రసరించడం వలన ఆ నీటితో స్నానం చేయడం ఆరోగ్యానికి మంచిది. మాఘస్నానం విధులను మాఘపురాణంలో వివరించబడగా, మాఘస్నానం మహత్యాన్ని బ్రహ్మాండ పురాణంలో పేర్కొనబడి వుంది.

గృహస్నానం ఆరు సంవత్సరాల పుణ్యాన్ని, బావి స్నానం 12ఏళ్ల పుణ్యాలను, తటాక స్నానం ద్విగుణం, నదీస్నానం చతుర్గుణాలను, మహానది స్నానం శతగుణాన్ని, గంగాస్నానం సహస్రగుణం, త్రివేణి సంగమ స్నానం శత సహస్ర గుణాల ఫలాలను అందిస్తుందని పురాణాలు పేర్కొంటున్నాయి.

కాలం దేవతా స్వరూపం. కాలానుగుణంగా కర్మలన్నీ జరుగుతాయి. మాఘమాసంలో చేసే స్నానం వలన శరీరంలోని మలినాలు తొలగడంతోపాటు ఔషద గుణాలు లభిస్తాయి. పలు రకాల రుగ్మతలను నివారించే శక్తి ప్రవహించే నీటికి వుంది. ఆరోగ్యాన్ని పుణ్య ఫలాలను అందించే మాఘ స్నానం ఆచరించడం పరమోత్తమం అని పురాణాలు చెప్తున్నాయి.



## ట్రంకు రోడ్డు

### బ్రోకర్ల సందడి!



గత రెండేళ్లుగా నెల్లూరులో స్థలాల కొనుగోళ్లు, అమ్మకాలు మందగించాయి. టౌన్‌లో మినహా శివారు ప్రాంతాల్లో అమ్మకాలు, కొనుగోళ్లు నామమాత్రం. ఇటువంటి పరిస్థితుల్లో పొదలకూరు రోడ్డులో కార్పొరేషన్, జడ్పీ కార్యాలయాలు కట్టడంతో ఈ ప్రాంతంలో స్థలాల ధరలు, ఇంటి అద్దెలు పెరిగిపోతున్నాయి. ఈ మధ్యే ముఖ్యమంత్రి చేత టి.బి హాస్పిటల్ ప్రాంగణంలో నూతన కలక్టరేట్ భవనానికి శంకుస్థాపన చేయిస్తామని ఆర్థికమంత్రి ప్రకటించిన నేపథ్యంలో కొత్తూరు శివారు ప్రాంతాల వరకు స్థలాల కొనుగోళ్లు, అమ్మకాలు ఊపందుకొన్నాయి. వున్న వాటికి నాలుగుజోడించి బ్రోకర్లు చెబుతూ మహాబిజీగా వున్నారు.

### యాచన బాటలో...



భిక్షగాళ్లు లేకుండా చేయాలని, యాచక వృత్తికి స్వస్తి చెప్పించి వారిని వివిధ మార్గాలలోకి మళ్లించేందుకు అధికారులు, ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు కృషి చేస్తున్నాయి. అయితే ఇటీవల కాలంలో రాజకీయ పార్టీలు, వాటి అనుబంధ విభాగాలు, విద్యార్థి సంఘాలు తమ నిరసనను తెలియజేయను భిక్షాటన బాట పడుతున్నాయి. అది ఏ కార్యక్రమమైనా, ఎలాంటి ఆందోళనైనా, నిరసన అయినా జోలెపట్టి భిక్షాటన చేయడం కొత్త పంధాగా మారింది. నేతలు, విద్యార్థి సంఘాల్లోని విద్యార్థులు, విద్యార్థినులలో రోజుకొకరు జోలె పట్టి ట్రంకురోడ్డుపై పడడంతో వ్యాపారస్తులు ఏమి చెప్పలేక ఎంతోకొంత జోలెల్లో వేసి పంపుతున్నారు.

### హాయిగా వున్నాను!



అధికారమే పరమపదసోపానమనే తరహాలో నేతలుంటారు. కాని ఈ అధికారమే నేతలకు చాలాసార్లు ముళ్ల కిరీటమవుతుంది. ఇలాంటి అనుభవమే సీనియర్ కాంగ్రెస్ నేత కొణిజేటి రోశయ్యకు ఎదురయ్యింది. అనూహ్య పరిస్థితుల్లో ముఖ్యమంత్రి కుర్చీనెక్కి ఒకటిన్నర సంవత్సరంపాటు పరిపాలించిన ఆయన అనేక వత్తిళ్లు అనుభవించాడు. వర్షాలు, వరదలు, రాజకీయ కల్లోలాల వంటివి ఆయన్ను ఎంతగానో క్షోభపెట్టాయి. ఆ పదవి నుంచి వైదొలగిన తర్వాత ఆయన ఎంతగానో ప్రశాంతంగా వున్నారు. ఈ విషయాన్ని రోశయ్యగారే స్వయంగా చెప్పారు. 20వతేది నెల్లూరు వచ్చిన ఆయన విలేకరులతో మాట్లాడుతూ ఇప్పుడు ఎంతో హాయిగా వుంది. ముఖ్యమంత్రిగా వుండగా ఒత్తిడి కారణంగా చికాకు, అసహనం, కోపం వుండేది. ఇప్పుడు చాలా హాయిగా వున్నానని విలేకరులపై చలోక్తులు విసురుతూ చెప్పుకొచ్చారు.

### వణుకుతున్న జైలు అధికారులు



నెల్లూరు సెంట్రల్ జైలులో పనిచేసే అధికారులు, సిబ్బంది ఇంతవరకు కాలిమీద కాలువేసుకొని తాపీగా విధులు నిర్వహించేవారు. మామూలుగా ఈ జైలులో హత్యలు, అత్యాచారాలు, దొంగతనాలు, ఇతర కేసుల్లో శిక్షపడిన వ్యక్తులతోపాటు మావోయిస్టులు వుండేవారు. కాని చర్లపల్లి జైలులో గడబిడ చేస్తున్నారని గత నెలలో ఫిరోజ్ ఖాన్, దేవయ్య, హబీబ్‌లను ఇక్కడకు తరలించారు. వీరితో ఎందుకు సరిపెట్టాలని గతవారంలో ఐఎస్ఐ తీవ్రవాదులు వికారుద్దీన్, అలీభాయ్‌లను ప్రత్యేకంగా ఇక్కడకు పంపారు. నెల్లూరు జైలులో పరిస్థితులు ప్రశాంతంగా వుంటాయి. ఒక్కసారిగా ఐఎస్ఐ తీవ్రవాదులు రావడంతో ఖైదీలు, జైలు అధికారులు వణికిపోతున్నారు. భవిష్యత్తులో ఇక్కడ ఏం జరుగుతుందనే దానికి కాలమే సమాధానం చెప్పాలి.

### కలెక్టర్‌కు కోపమొచ్చింది!



జిల్లా కలెక్టర్ రాంగోపాల్ ఎప్పుడూ ప్రశాంతంగా కన్పిస్తుంటారు. కోపమనేది ఆ ముఖంలో సాధారణంగా కనిపించదు. అటువంటి ఆయన జిల్లా సాగునీటి సలహాబోర్డు సమావేశంలో సాగునీటి పనులు చేస్తున్న కాంట్రాక్టర్లపై ఆగ్రహించారు. ఏం చేస్తున్నారు వారు... నిర్ణీత కాలవ్యవధిలో ఒక్క పని పూర్తి చేయరు. ఏ పనిలోనూ నాణ్యత కనపడడం లేదు. పనులు చేయని, సక్రమంగా చేయని వారిని డి-లిస్ట్‌లో పెట్టేస్తానని హుంకరించడంతో నీటి పారుదల శాఖాధికారులు క్వశ్చన్‌మార్కు ఫేసులు పెట్టారు తప్ప నోరు తెరచి మాట్లాడే సాహసం చేయలేదు.

# వారఫలాలు

*తేది 26-2-2011 నుండి 4-3-2011 వరకు కుంభంలో రవి, బుధ, కుజులు; మకరంలో శుక్రుడు; ధనుస్సులో రాహువు; మీనంలో గురువు; కన్యలో శని; మిథునంలో కేతువు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాల్లో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మూర్ఖపు పట్టుదలలు పనికిరావు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది లేదా ఆప్తుల సలహాలు వినడం మంచిది. ధనవిషయాలలో లోటు లేదు. వివిధ మార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు. రాజకీయులకు ఉత్తమకాలం.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

చిన్న చిన్న సమస్యలు పెద్దవి అవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. నోటికి కడుపుకు సంబంధించిన అనారోగ్య బాధలుంటాయి. ఆదాయానికి తగ్గ ఖర్చు వుంటుంది. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది. ఉద్యోగులకు శ్రమ అధికం.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ధనవిషయంలో కటకట తొలగవచ్చు. ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. ఇంటిలో వివాహసంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. రాజకీయులకు దురదృష్టకాలం. వుద్యోగులకు గొడవలతో సాగుతుంది.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ముందుచూపుతో అడుగేయాలి. ప్రతివిషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. నరాలకు సంబంధించిన బాధలధికం. సంతానమూలంగా మానసిక వేదనకు గురౌతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. ఎవరికి ఎలాంటి మాట ఇవ్వవద్దు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

పొరసంబంధాలు చక్కగా వుండవు. సంబంధం లేని విషయాల్లో తల దూర్చవద్దు. ఆరోగ్యవిషయంలో పెద్దగా చెప్పుకోతగ్గదేమీ లేదు. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. కళాకారులకు ఆశాభంగం. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది. ఉద్యోగులకు శ్రమాధిక్యత ఉంటుంది. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్త 1, 2 పా

ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి. పైవారిని విమర్శించకుండాలి.



**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

ముందుచూపుతో అడుగేయాలి. ఆచరణలో సాధ్యంకాని రీతిలో ఆలోచిస్తారు. ఇతరులు బాధపడే రీతిలో నడుచుకోవద్దు. సంతాన మూలంగా ఇబ్బందులుండవచ్చు. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. వ్యాపారులు ఖాతాదారుల వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. ఎదురుచూసిన సత్ఫలితాలు దక్కవు.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ

కష్టసుఖాలు సమానంగా చోటు చేసుకొంటాయి. ఊహించినరీతిలో ధనాదాయం ఉంటుంది. ఆరోగ్యవిషయంలో కొంత మేలు. సంతానం యొక్క పురోభివృద్ధి ఆనందాన్నిస్తుంది. సోదరుల మూలంగా కూడా ఖర్చవవచ్చు. బంధుమిత్రుల సహాయసహకారాలు అందుతాయి. రియల్ ఎస్టేట్ పనులు ఊపందుకొంటాయి. భూభవనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.



**ధనస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

ధన విషయంలో కూడ కటకట తొలగవచ్చు. సోదరులతో అభిప్రాయ భేదావకాశాలు. ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. ఇంటిలో వివాహ సంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకున్నా ఏదో లోపం ఉన్నట్టు తోస్తుంది. ఆహార విషయంలో జాగ్రత్త. అభిప్రాయ భేదాలు రాకుండా చూసుకోవాలి. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. చిరకాలంగా ఎదురుచూస్తూ వచ్చిన శుభఫలితాలు అనుభూతిలోనికి వస్తాయి. శత్రువులు లొంగి నడుచుకొంటారు. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం గాదు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా

అనవసరంగా బాధదాయకమైన ఊహలకు గురి కావద్దు. మార్పులు, చేర్పులు, కూర్పులు జరుగవచ్చు. పైవారితో అభిప్రాయభేదాలున్నా బయటపడనీయవద్దు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. ఓపిక అవసరం. వివాహాది శుభకార్య ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు ఓ మోస్తరుగా సాగుతుంది.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఆర్థికవిషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. తండ్రి తండ్రివంటివారికి ఇబ్బందులుండవచ్చు. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. బయటవారి కోసం ఖర్చు చేస్తారు. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.

## పంచాంగం

**శుభ ముహూర్తాలు లేవు**

**ఫిబ్రవరి తిథులు**
**మాఘ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 26 | శని | నవమి | సా.5.06 | గం.ల.వ |
| 27 | ఆది | దశమి | సా.5.06 | గం.ల.వ |
| 28 | సోమ | ఏకాదశి | సా.6.13 | గం.ల.వ |

**మార్చి తిథులు**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మంగళ | ద్వాదశి | రా.7.47 | గం.ల.వ |
| 2 | బుధ | త్రయోదశి | రా.9.41 | గం.ల.వ |
| 3 | గురు | చతుర్దశి | రా.11.51 | గం.ల.వ |
| 4 | శుక్ర | అమావాస్య | రా.2.11 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# భారతీయ 'వాస్తు' ప్రాంతీయ ప్రవర్తిత వివరణలు!

ఎస్.ఇందుమతీదేవి — నెల్లూరు

* *భారతదేశం మూడు ప్రాంతాల్లో మూడు వాస్తులను పాటిస్తున్నట్లు మీరొక మీటింగులో చెప్పారు?*

భారతదేశంలో మధ్య హిమాలయాలకు మధ్యనాగర వాస్తును, వింధ్య తర్వాత వేసరజాతి వాస్తును, ఆ తర్వాతి ద్రవిడ దేశాలలో 'ద్రావిడ' వాస్తును ప్రాచీన కాలం నుంచి పాటిస్తున్నారు.

పూడిపర్తి లక్ష్మీరాజ్యం — ఒంగోలు

* *స్థలం కొన్ని దిక్కుల్లో పెరిగింది. నిర్మాణం కొన్ని దిక్కుల్లో పెరిగింది, తగ్గింది. ఇప్పుడేం చేయడం?*

సంబంధిత యంత్రం ప్రతిష్టించుకొని రెండేళ్ల కొకసారి మారుస్తూ కాలక్షేపం చేయాలి. లేదా అమ్మివేయాలి.

తిక్కవరం వేంకటరెడ్డి — తడ

* *వాయువ్యం సెప్టిక్ ట్యాంకు తీసేశాక మానసిక వత్తిడులు చాలా తగ్గాయి.*

నాలుగు దిక్కుల్లో సెప్టిక్ట్యాంకులు కలిగించే 'వేధ' అంతా ఇంతా కాదు. వాయువ్యం మానసిక వేధ కారణం అంటోంది కశ్యపవాస్తు.

పి.అనుసూయమ్మ — నెల్లూరు

* *కోడలి జన్మ నక్షత్రం, ఆమె మా యింటికి వచ్చిన నక్షత్రం దురదృష్టకరమైనవంటున్నారు.*

అశ్వని నక్షత్రం జన్మ నక్షత్రం, భరణి నక్షత్రం ఇంటి ప్రవేశం. చెప్పిన వాడికి శాస్త్రం తెలియదు. కోడల్ని కూతురులా చూసుకోండి. మీ మనస్థితి మార్చుకోండి.

ఎ.బాలసరస్వతి — గుంటూరు

* *ఇంట్లో అందరికీ ఏదో ఒక అస్వస్థత లున్నాయి. మంచి సలహా ఇవ్వండి.*

మీ సుదీర్ఘమైన ఉత్తరం చదివాను. జన్మ కాలం – గృహ దిక్కును బట్టి మీరు సుదర్శన, శీతల, లక్ష్మీగణపతి యంత్రాల్లో ఏది నిర్ధారణ అయితే అది ప్రతిష్టించుకొంటే చాలా ఫలితం వుంటుంది.

ఎం.కరుణాకర్‌రెడ్డి — నెల్లూరు

* *తూర్పు అపార్టుమెంటు నిర్మాణంలో వాయువ్యం పెరిగింది?*

అపార్టుమెంటు ఈశాన్యం చూస్తోంది. అందువల్ల 'కోణవేధ' ఏర్పడుతుంది. వాయువ్యం పెరగడమంటే యజమాని మానసికంగా పతనం కావడమని అర్థం.

ఎన్.కోటారెడ్డి — బెంగుళూరు

* *లక్షలు, కోట్లు ఆర్జిస్తాను. ఒక రూపాయి మిగలదు.*

డబ్బు ఎట్లా, ఏ పద్ధతిలో సంపాదిస్తున్నామన్నది ముఖ్యం. అన్యాయార్జితం నిలవదు. ఉత్తరంలో చాలా లోపాలున్నాయి. కుబేరుడు కనికరించడం లేదు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

ఎం.రాధికాపూర్ణిమ — చెన్నై

* *అనివార్య కారణాల వల్ల 'వేప వృక్షాన్ని' తీసివేయవలసి వస్తున్నది.*

గృహ నిర్మాణం, గృహం కొనుగోలు సమయంలో 'వృక్ష విషయం' పరిగణనలోకి తీసుకోవాలి. 'వృక్షవేధో దోషం' వదిలించుకోవడం చాలా కష్టం. దానికి పద్ధతులు చాలా వున్నాయి.

కె.పాపారాయుడు — శ్రీకాకుళం

* *తూర్పు, ఉత్తరం, ఈశాన్యాల వీధులు తగులుతున్నాయి. వీధి చూపులు మంచివంటారు కదా?*

ఉచ్ఛ స్థానాల వీధులు మంచివనే శాస్త్రాలు చెబుతున్నాయి. అయితే అవి చేసే మంచికంటే 'దృష్టిదోషాల' వేధలే ఎక్కువ మరి!

బి.రమణారెడ్డి — ఆత్మకూరు

* *ఈశాన్యం ప్రహరీ బాగా పెరిగింది. పెద్ద వాళ్లకు బాగానే జరిగింది.*

ఒక దిక్కు కోణరీత్యా పెరగడమంటే మరో దిక్కు తగ్గడమనే అర్థం. శుక్ర, గురు, బుధ మహర్దశలున్నంత కాలం బాగానే జరుగుతుంది. ఆ తర్వాతే కదా అవస్థలు, దురవస్థలు.

డి.లక్ష్మీప్రసన్న — నాయుడుపేట

* *పిల్లలు చదవరు. ఆయన పద్ధతులు మార్చుకోరు. మనోవ్యధతో బాధ పడుతున్నాను.*

పిల్లలకి నిర్ధారిత రత్నధారణ చేయించండి. బ్లాకు(రెండు వీధులు) గృహాల్లో సమస్యలట్లాగే వుంటాయి. 'లక్ష్మీగణపతి' యంత్రం కొంతవరకు మీ వారి ప్రవర్తనలో మార్పు తెస్తుంది.

● రుణాల మంజూరులో

# రైతులకు మొండిచెయ్యి!

**2010 సంవత్సరంలో వచ్చిన లైలా, జల్ తుఫాన్లకు జిల్లా రైతులు బాగా దెబ్బతిన్నారు. వీరికి రుణాలిచ్చి ఆదుకొంటామని చెప్పిన ప్రభుత్వం బ్యాంకుల చేత వాటిని ఇప్పించడంలో విఫలమయ్యింది.**

వ్యవసాయ రుణాలు మంజూరు చేయడంలో బ్యాంకు అధికారులు రైతులకు మొండిచేయి చూపించారు. 2010వ సంవత్సరంలో రెండు దఫాలు సంభవించిన "లైలా", "జల్" తుఫాన్ల కారణంగా వ్యవసాయ పంటలు వేసిన రైతులు భారీగానే నష్టపోయారు. ఈ నష్టాల నుంచి బయట పడేందుకు ప్రభుత్వం అన్ని విధాల సహాయ సహకారాలు అందించాలని విజ్ఞప్తి కూడా చేశారు. అప్పటికే బ్యాంకుల నుంచి వ్యవసాయ రుణాలు పొంది వుంటే వాటిని రీషెడ్యూల్ చేసి తిరిగి రుణాలు అందిస్తామని రాష్ట్ర ముఖ్య మంత్రి ప్రకటించారు.

ముఖ్యమంత్రి ప్రకటన చేయడాన్ని రైతులు హర్షించారు. అయితే వ్యవసాయ రుణాల కోసం బ్యాంకు అధికారులను కలిస్తే వారు చెప్పిన మాటలు విని రైతులు ఖంగుతినాల్సి వచ్చింది. ప్రభుత్వం నుంచి గాని, రిజర్వు బ్యాంకు నుంచి గాని రుణాలు ఇవ్వమని ఎటువంటి ఆదేశాలు అందలేదని అస్పష్టమైన సమాధానం చెప్పారు. బ్యాంకులు రుణాలు అందిస్తాయని ఎంతో ఆశతో ఎదురు చూసిన రైతులకు చివరకు నిరాశే మిగిలింది. రాష్ట్రస్థాయి బ్యాంకర్ల సమావేశంలోనూ, జిల్లాస్థాయి బ్యాంకర్ల సమావేశంలో రుణాలు అందించే విషయంపై చర్చించి తీర్మానం చేసినప్పటికి బ్యాంకుల పరిధిలో వున్న రైతులకు వ్యవసాయ రుణాలు అందించేందుకు నిరాకరిస్తున్నారు.

బ్యాంకర్ల సమావేశంలో ప్రకటించడానికి, వాస్తవ పరిస్థితులకు ఏ మాత్రం పొంతన వుండడం లేదు. జిల్లాలో జాతీయ బ్యాంకులు 15 వరకు వున్నాయి. ప్రధానంగా గ్రామీణ ప్రాంతాలలో స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా, ఆంధ్రాబ్యాంకుతోపాటు ఆంధ్రప్రగతి గ్రామీణ బ్యాంకులు ఏర్పాటై వున్నాయి. వ్యవసాయ రుణాలు మంజూరు చేసే విషయంలో బ్యాంకు మేనేజర్లకు పూర్తి అధికారం వుంటుంది. వీరు కూడా కొన్ని సందర్భాలలో రాజకీయ ఒత్తిళ్లకు తలొగ్గి రుణాలు అందించాల్సిన పరిస్థితి ఏర్పడింది. 2008 సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వం వ్యవసాయ రుణాలను మాఫీ చేసింది. దీంతో ఎంతోమంది రైతులకు రుణమాఫీ పథకం వర్తించింది. 10వేల నుంచి లక్షరూపాయల వరకు రుణాలు రద్దు కాబడ్డాయి. రుణమాఫీ పథకం తర్వాత ఆశించిన మేర బ్యాంకులు వ్యవసాయ రుణాలు అందించేందుకు ఆసక్తి చూపడం మానేశాయి. బ్యాంకుల్లో డిపాజిట్లు వున్న రైతులకే తిరిగి రుణాలు అందిస్తున్నాయే తప్ప చిన్న, సన్నకారు రైతులకు ఏదోఒక కారణం చూపి నిరాకరిస్తున్నారు. బ్యాంకు అధికారుల వైఖరి కారణంగా విసుగు చెందిన రైతులు బయట అప్పులు చేసి వరిపంటను సాగు చేసుకోవాల్సిన పరిస్థితి తలెత్తింది.

### కౌలు రైతుల పరిస్థితి అధ్వాన్నం

సొంత హక్కుదారుల పరిస్థితి పై విధంగా వుంటే కౌలు రైతుల పరిస్థితి మరింత అధ్వాన్నంగా తయారైంది. పెద్ద రైతుల నుంచి కౌలుకు మాగాణి భూములు తీసుకొని సాగుబడి చేసేందుకు నానా అవస్థలు పడుతున్నారు. సొంత హక్కుదారులకు ఏ విధంగా బ్యాంకులు వ్యవసాయ రుణాలు అందిస్తున్నాయో అదే విధంగా కౌలు రైతులకు కూడా రుణాలు అందించాలని రాష్ట్ర ప్రభుత్వం ఇదివరకే రాష్ట్రస్థాయి బ్యాంకర్ల సమావేశంలో నిర్ణయించింది. సమావేశంలో నిర్ణయమైతే తీసుకున్నారు గాని అమల్లోకి వచ్చే సరికి అనేక కారణాలు చూపుతున్నారు.




రైతుల రుణ అవసరాలను తీర్చలేకపోతున్న జిల్లా కేంద్ర సహకార బ్యాంక్.

బ్యాంకుల చుట్టూ తిరగలేక విసిగిపోయారు. 2010-2011 ఖరీఫ్ సీజన్‌కు ఆశించిన వ్యవసాయ రుణాలు అందించలేకపోయాయి బ్యాంకులు. సభలు, సమావేశాల్లో మాత్రం వందల కోట్ల రూపాయలు రుణాలు అందించామంటూ బ్యాంకు అధికారులు ప్రకటనలు గుప్పిస్తుంటారు. ఏ గ్రామంలో ఎంత మంది రైతులకు ఎన్ని రుణాలు అందించారన్న సమాచారం వెల్లడిస్తే బాగుంటుంది.

### సహకార బ్యాంకు పరిస్థితి

రైతుల భాగస్వామ్యంతో ఏర్పాటు చేయబడిన సహకార బ్యాంకు అధికా రులు జాతీయ బ్యాంకులకు ఏమాత్రం తీసిపోమన్న విధంగా వ్యవహరిస్తున్నారు. ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలు గ్రామీణ ప్రాంతాల్లోని రైతులకు విరివిగా రుణాలు అందించాలి. ప్రస్తుతం వీటికి అవసరమైన నిధులు రాష్ట్రస్థాయి నుంచి విడుదల కాకపోవడంతో రుణాలు అందించలేని స్థితికి చేరుకున్నాయి. పాత బకాయిలు కోట్ల రూపాయల్లో పేరుకు పోయి వున్నాయి. సహకార బ్యాంకుల్లో రాజకీయ ఆధిపత్యం ఎక్కువగా వుంటుంది. ఏది ఏమైనా ఈ ఖరీఫ్ సీజన్‌లో వ్యవసాయ రుణాలు కొద్ది మందికే అందించడం విశేషం.



సాగునీటికి పాట్లు

# ఆయకట్టు రైతులకు సాగునీరు అందేనా?

**ఈ యేడాది రకరకాల ఇబ్బందుల వల్ల రైతులు ఆలస్యంగా వ్యవసాయం మొదలు పెట్టారు. సాగుచేసిన ఆయకట్టుకు సాగునీరు అందుతుందా లేదా అన్న ధర్మ సందేహం వారిలో ఎక్కువయ్యింది. అధికారులు, అధికార పార్టీ నాయకులు వారి సందేహ నివృత్తి చేయాల్సి వుంది.**

జిల్లాలో వరిపంట సాగుచేస్తున్న చివరి ఆయకట్టు రైతులకు సాగునీరు అందడం కష్టతరంగా మారింది. ఖరీఫ్ సీజన్‌కు సంబంధించి ప్రతి సంవత్సరం మార్చి నెలాఖరుకు నీటి విడుదలను నిలిపి వేస్తుంటారు. ఈ సంవత్సరం కొన్ని ప్రాంతాలలో ఆలస్యంగా వరిపంట వేయడం జరిగింది. ఆలస్యంగా వరిపంట సాగుచేసిన ఆయకట్టుకు సక్రమంగా సాగునీరందక పోవడంతో రైతులు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. నీటిపారుదల శాఖ అధికారులు, రాష్ట్ర ప్రభుత్వం స్పందించే దాఖలాలు ఏమాత్రం కనిపించడం లేదు.

జిల్లాలో పెన్నా డెల్టా కింద రెండు లక్షల 47వేల ఎకరాలు, కనుపూరు కాల్వ కింద 33వేల ఎకరాలు, కావలి కాల్వ కింద 72వేల 489 ఎకరాలు, నార్త్‌ఫీడర్ కాల్వ కింద 28వేల 503 ఎకరాలు, సౌత్ ఫీడర్ కాల్వ కింద 26వేల 708 ఎకరాల ఆయకట్టు వుంది. ఈ ఆయకట్టు కాకుండా అనధికారికంగా మరో 50వేల ఎకరాల్లో వరిసాగు చేస్తున్నారు. అదనపు ఆయకట్టుకు సాగునీటి వసతి కల్పించలేకపోతున్నందున రైతులు మోటార్లు ఏర్పాటు చేసుకుని కాల్వల నుంచి సాగునీటిని వినియోగించుకుంటున్నారు. నీటి మట్టం అధికంగా వుంటే ఏ ఒక్కరికి కూడా ఎటువంటి ఇబ్బంది లేకుండా సాగిపోతుంది.

సాగునీటి కాల్వలకు ప్రస్తుతం విడుదల చేసిన నీటిమట్టం పరిమాణం తగ్గడంతో మోటార్ల ద్వారా నీటిని వినియోగించుకునేందుకు ఆయకట్టు కింద రైతులు ఏమాత్రం ఒప్పుకోవడం లేదు. ఈ పరిస్థితిని ప్రధానంగా కావలి కాల్వ కింద రైతులు ఎదుర్కొంటున్నారు. సోమశిల రిజర్వాయర్ నుంచి కావలి కాల్వకు సాగునీరు విడుదల అవుతుంది. అయితే ఈ కాల్వకు ఇరువైపులా కొందరు రైతులు మోటార్లు అమర్చుకొని నీటిని తోడేస్తున్నారు. ఇలా చేయడం వల్ల జలదంకి, కావలి ప్రాంత రైతులకు సాగునీరు అందకుండా వరిపంట ఎండిపోయే ప్రమాదం ఏర్పడింది.

కాల్వకు మోటార్లు ఏర్పాటుచేసిన విషయాన్ని నీటి పారుదల శాఖ అధికారుల దృష్టికి తీసుకెళ్లినా ఎటువంటి ప్రయోజనం లేకుండా పోయిందని ఆయకట్టు రైతులు ఆవేదన చెందుతున్నారు. అల్లూరు, బోగోలు మండలాల్లో ఆలస్యంగా నాటిన నాట్లకు ఏప్రెల్ రెండవ వారం వరకు సాగునీరు అవసరం ఏర్పడుతుంది. దీనికి సంబంధించి అధికారుల నుంచి ఎటువంటి హామీ ఇప్పటివరకు లభించలేదు. మరో ప్రక్క సాగు నీటి సంఘాల అధ్యక్షులు, డిస్ట్రిబ్యూటరీల ఛైర్మన్‌లు సాగు నీటి విషయంలో పెద్దగా స్పందించడం లేదన్న విమర్శలు వున్నాయి.




సాగునీటి పంపిణీలో శ్రద్ధ వహించని నీటిపారుదల శాఖ కార్యాలయం.

గత సంవత్సరం సంభవించిన రెండు తుఫానుల కారణంగా వరి పంట బాగా దెబ్బతిన్నది. వర్షాల ప్రభావంతో సోమశిల రిజర్వాయర్‌లో నీటి లభ్యత వుంటుందని ఆశించిన రైతాంగానికి అధికారుల తీరుతో నిరాశ చెందాల్సిన పరిస్థితి ఏర్పడింది. మొత్తం మీద పెన్నా డెల్టాతోపాటు ఇతర సాగునీటి కాల్వల కింద వున్న చివరి ఆయ కట్టు రైతులు నష్టపోకుండా చూడాల్సిన బాధ్యత నీటిపారుదల శాఖ అధికారులపై వుంది.



# త్రిష జంతు సేవ



తమ అందచందాలతో ప్రేక్షకులను ఊరించి థియేటర్లకు రప్పించడం, ఎప్పుడూ నాలుగైదు సినిమాలతో బిజీగా వుంటూ బ్యాంక్ బ్యాలెన్సులు పెంచుకోవడం, ఏ పనీ లేనప్పుడు ఏదేదో మాట్లాడి కనీసం ప్రచారంలో వుండడం హీరోయిన్లు చేస్తుంటారు. కాని త్రిష మాత్రం తక్కిన హీరోయిన్లలా కాకుండా సంఘసేవకు నడుంబిగించింది. అందులో భాగంగా వీధి కుక్కల సంరక్షణకు పూనుకుంది. దీని కోసం ఓ స్వచ్ఛంద సంస్థతో కలసి పని చేయడానికి అంగీకారం తెలిపింది. మూగజీవాలను కాపాడుకోవలసిన బాధ్యత మనందరి మీదా వుంది. అందుకోసం ప్రతి ఒక్కరూ తమవంతు సహాయం చేయాలని అభిమానులకు త్రిష సందేశం కూడా పంపింది.

# ఆనందంతో అందం



అందమైన హీరోయిన్గా ఇలియానాను చెప్పుకోవచ్చు. అందం పెంపొందింపజేసుకోను ఏం చేస్తున్నారంటే మార్కెట్‌లో దొరికే క్రీములు వాడనంది. సహజ సౌందర్యం ముందు ఇవి దిగదుడుపే. మనసునిండా ఆత్మ విశ్వాసం నింపుకొంటే చాలు. అందం, ఆనందం రెండు దొరుకుతాయి. ఎప్పుడూ మొహంపై నవ్వు చెరిగిపోనివ్వద్దు. అమ్మాయికి చిరునవ్వే ఆభరణం. నావరకు నేను ఎన్ని కష్టాలొచ్చినా మొహంపై నవ్వు చెరిగిపోనివ్వనంది.

# మంచి సినిమాల్లోనే నటిస్తా!



ఉల్లాసంగా ఉత్సాహంగా, కరెంట్, సింహా చిత్రాల్లో హీరోయిన్ స్నేహ ఉల్లాల్ తమిళ, కన్నడ సినిమాల్లోనూ నటిస్తుంది. అలా మొదలైంది చిత్రంలో ఆమె చాలా చిన్న పాత్రలో కనిపిస్తుంది. కారణమడిగితే దర్శకురాలు నందినిరెడ్డి స్నేహితురాలంది. అవకాశాలను అందిపుచ్చుకోవడంలో విఫలమవుతున్నట్లుందే అంటే; చేతిలో నాలుగైదు సినిమాలు పెట్టుకొని హడావుడి చెయ్యాలనే ఆలోచన నాకు ఎప్పటికీ రాదు. నా ముందున్న కథల్లో మంచి వాటిని ఎంచుకొని శ్రద్ధగా పనిచెయ్యడమే తనకు తెలుసంది. ప్రస్తుతం తన కెరీర్ తాననుకొన్నట్లుగానే సాగుతుందని, దీనివల్ల మిగతా విషయాల గూర్చి తాను పట్టించుకోవడం లేదంది.

# విద్యాబాలన్ నగ్న చిత్రం



సిల్క్ స్మిత జీవితాధారంగా రూపొందుతున్న చిత్రంలో నటిస్తున్న హీరోయిన్ విద్యాబాలన్ అందాల ప్రదర్శనకు సై అంది. స్మిత సెక్సీగా వుండేదని ఆమెలా తన దేహం కనపడను ప్రత్యేక వ్యాయామాలు చేస్తుంది. ఇష్కియా చిత్రంలో హాట్‌హాట్‌గా కనిపించిన విద్యాబాలన్‌ను చూసి ప్రముఖ చిత్రకారుడు ఎమ్.ఎఫ్.హుస్సేన్ ఆమె అభిమానిగా మారిపోయారు. ఆమె ముందు హుస్సేన్ ఓ ప్రతిపాదన వుంచారు. విద్య రూపాన్ని నగ్నంగా కాన్వాస్ మీదకు తీసుకొస్తానని... అందుకు నగ్నంగా ఫోజులు కావాలని కోరారట. ఈ ప్రతిపాదన తనకు అంగీకారమే నని విద్యా చెప్పిందని బాలీవుడ్‌లో విస్తృత ప్రచారం జరుగుతుంది.



పంజాబీ అమ్మాయి తాప్సి తెలుగుతోపాటు తమిళ, మళయాళ భాషల్లోనూ బిజీబిజీ తారగా మారిపోయింది. తెలుగులో ఆమె తాజా చిత్రం వస్తాడు నారాజులో ఆమె కాస్త అతిగా నటించిందన్న విషయమై వివరణ ఇచ్చింది. సినిమా అనేది గ్లామర్ ప్రపంచం. పాత్రలకు అనుగుణంగానే వస్త్రధారణ వుంటుంది. ఆధునిక వస్త్రాలు వేసుకొనేది కేవలం అందాల ఆరబోతకే అనే

## కట్టు బొట్టులు మారాయి

ఆలోచన పాతకాలం నాటిది. వాస్తవం మాట్లాడుకొంటే కథానాయిక నిండుగా చీరకట్టుకొనే పాత్రలు ఎన్ని వస్తున్నాయి? వస్తే చేసేందుకు మాకేం అభ్యంతరం లేదు. సినిమాల్లోనే కాదు బాహ్య ప్రపంచంలోనూ వస్త్రాలంకరణ కట్టు బొట్టులో మార్పులొచ్చాయి. ఈ పోకడల్నే సినిమాల్లోనూ చూపిస్తున్నారు. దాన్నే మీరు శ్రుతి మించిందంటున్నారని చెప్పుకొచ్చింది.

# సాదా సీదాగా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం అప్పల్రాజు!



✍ అల్లూరు రహీం

బాగా తలబిరుసున్న దర్శకుడు రామ్‌గోపాల్‌వర్మ సినీ పరిశ్రమపై తీసిన వ్యంగ్యాస్త్రం కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం – అప్పల్రాజు చిత్రం. ఈ సినిమాలో ఆయన పనిగట్టుకొని నందమూరి ఫ్యామిలీకి చెందిన హీరోలను ఒక పథకం ప్రకారం ఉతికి ఆరేశాడు. అదే బాటలో పరిశ్రమలోని దర్శకుల లోటుపాట్లను స్పృశిస్తూ 'ఎవడబ్బ సొత్తు కాదురా టాలెంట్' పాటను చిత్రీకరించాడు. రియల్ లైఫ్ జీవితాలను రీల్ పైకి తీసుకరావడం తనకిష్టమని చెప్పుకొనే రామ్‌గోపాల్‌వర్మ మొత్తం మీద కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం – అప్పల్రాజును సరిగ్గా తీయలేకపోయాడు. బ్రహ్మానందం కనపడేవరకు సినిమా ఎత్తుపల్లాలలోనే నడుస్తుంది. మాటిమాటికోపాట, కుళ్లు డైలాగుల సాగదీతగా కనిపిస్తుంది. నా ఇష్టమొచ్చినట్లు సినిమా తీస్తా. ప్రేక్షకులు చూడాలనుకొంటే చూస్తారు... వద్దనుకొంటే మానేస్తారని చెప్పే వర్మ ఎంత బాధ్యతారాహిత్యమైన వ్యక్తో అర్థం చేసుకోవచ్చు. రొటీన్ సినిమాల నుంచి ప్రేక్షకులను రక్షించడానికి అప్పల్రాజును తీశానని చెప్పుకొంటున్న వర్మ ఒక్కసారి ఈ సినిమా ఆద్యంతం విడుదలకు ముందు చూసుకొని వుంటే బాగుండేది. పరిశ్రమలో హీరో, హీరోయిన్లు, సాంకేతిక నిపుణులు, దర్శకులు కావాలని వచ్చేవాళ్లు పడేపాట్లు వర్మకు సరిగ్గా తెలియనట్లుంది. అందువల్లే ఆయన హీరో అప్పల్రాజు ఈజీగా దర్శకుడైపోతాడు. ఈ సినిమాలో గొప్పగా చెప్పుకోవాల్సింది బ్రహ్మానందం క్యారక్టర్. దాని చిత్రీకరణ మాత్రం బ్రహ్మాండం. కలువ సాయి వ్రాసిన సినిమామయం, ఎవడబ్బసొత్తుకాదురా టాలెంట్, మాయాబజార్... దేవదాస్ చరణాలతో సాగే పాటలు పరిశ్రమలో వివిధ అంశాలకు సంబంధించినవి. ఏంపెట్టి పెంచావ్రా పాటను వర్మ కెమెరామెన్ సుధాకర్ సహాయంతో సెక్సీగా తీశాడు. రింగ్‌రోడ్డుకాడ పాట ఇదే తరహాలోనిదే. బ్రహ్మానందంపై చిత్రీకరించిన నాపేరే శ్రీశైలం కాస్త భిన్నంగా వుంటుంది. నీలేష్ వ్రాసిన డైలాగులు సినిమాలో హీరో పీకేదేందిరో? సినిమా అంటే చీటింగ్ తరహాలోనే సాగుతాయి. కోటి సంగీతంలో పాటలు ఓ మోస్తరుగా వున్నాయి.

చిత్రకథలోనికి వెళ్తే అమలాపురంలోని రంభ సినిమా థియేటర్‌లో తెగ సినిమాలు చూసే అప్పల్రాజు(సునీల్) ఏనాటికైనా సినీ దర్శకుడు కావాలన్న తపనతో హైదరాబాద్‌కు బయలుదేరుతాడు. అతని దగ్గర నాయికి సినిమా స్క్రిప్ట్ వుంటుంది. పరిశ్రమలో జూనియర్ ఆర్టిస్ట్‌గా పనిచేసే మిత్రుని సహాయంతో డబ్బింగ్ చిత్రాలు విడుదల చేసుకొనే నిర్మాత రాఖీ (రఘుబాబు) పరిచయమవుతాడు. నాయికి సినిమాగా తీయాలంటే హీరోయిన్‌గా కనిష్కను పెట్టాలనుకొంటారు. దీనికోసం నానాపాట్లు పడి ఆమెను ఒప్పిస్తారు. ఆమె ప్రియుడు యువహీరో బాబుకు ఒక వేషం ఎరగా చూపిస్తారు. ఆ తర్వాత ఫైనాన్షియర్ల వేటలో పడతారు. ఇంతలోనే కనిష్కకు, హీరో బాబుకు మనస్పర్థలొస్తాయి. బాబుకు పోటీయైన మరో హీరో కెటి(అజయ్)ను ఆశ్రయిస్తారు. కృష్ణ(స్వాతి), ఎంఎస్ నారాయణ అసిస్టెంట్ డైరక్టర్లుగా నాయికి చిత్రం మొదలవుబోతుంది. మళ్లీ ఫైనాన్స్ సమస్య తలెత్తుతుంది. ఈ సమయంలో సినిమాలంటే పడిచచ్చే దూల్‌పేట రౌడీ శ్రీశైలం (బ్రహ్మానందం) ఫైనాన్స్ చేయను ముందుకు వస్తాడు. అయితే ఈ చిత్రంలో పాటలు తానే వ్రాస్తానని, తన ప్రియసఖి సరళ (తనూరాయ్) చేత ఐటమ్ పాట పెట్టించాలంటాడు. మొత్తానికి సినిమా మొదలవుతుంది. మరోవైపు యువ హీరో బాబు శిబిరంలో కలవరం. ఆయన నాయికికి ఎన్నో అడ్డంకులు కల్పిస్తాడు. అప్పల్రాజు తయారు చేసుకొన్న సినిమా కథ పలు మార్పు చేర్పులతో చివరకు విడుదలవుతుంది. ప్రతిష్టాత్మక గుర్రం అవార్డులు సైతం పొందడంతో అప్పల్రాజు కలనెరవేరుతుంది.




సునీల్ ఈ చిత్రం కోసం బాగా లావు తగ్గాడు. నృత్యాలను ఉత్సాహంగా చేశాడు. కలర్స్ స్వాతి, సునీల్‌కు జంట కుదరలేదు. గన్‌మెన్‌గా వేణుమాధవ్ నటన బాగుంది. సాదా సీదాగా వున్న ఈ చిత్రాన్ని పబ్లిసిటీ మాయలోపడి చూసే ప్రేక్షకులే ఎక్కువ కనపడుతున్నారు.



నెల్లూరు పొగతోటలోని మాదరన్ రెటీనా సెంటర్‌లో డాక్టర్ వెంకటస్వామి మెమోరియల్ కాన్ఫరెన్స్ హాలును ప్రారంభిస్తున్న మధురైలోని అరవింద్ ఐ హాస్పిటల్‌లో విట్రియో రెటినల్ విభాగాధిపతి డాక్టర్ నరేంద్రన్. ప్రక్కన డాక్టర్ శరవణన్, డాక్టర్ గోపాలకృష్ణ, డాక్టర్ భారతి.

# బకాయిల వసూళ్లపై ప్రత్యేక దృష్టి!

## రంగంలోకి దిగిన కార్పొరేషన్ సిబ్బంది

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌కు పన్నుల రూపంలో చెల్లించాల్సిన బకాయిలపై అధికారులు ప్రత్యేక దృష్టి సారించారు. మరో నెలలో ఆర్థిక సంవత్సరం గడువు ముగియనుండడంతో ఆదాయం పెంచుకోవాలన్న లక్ష్యంతో కార్పొరేషన్ అధికారులు బకాయిదారులకు ఇటీవల నోటీసులు జారీ చేయడం జరిగింది. బకాయిలు చెల్లించకుంటే షాపులను సీజ్ చేస్తామని హెచ్చరించిన అధికారులు మరోసారి పునః సమీక్షించుకుని దుకాణాలను మూసి వేయకుండా ఏదో ఒక విధంగా బకాయిలు వసూలు చేసుకోవాలని నిర్ణయించారు. కార్పొరేషన్‌కు ప్రభుత్వం నుంచి నిధులు విడుదల కాకపోవడంతో పన్నులపైన ఆధారపడాల్సి వచ్చింది. దీంతో బకాయిదారుల జాబితాను కూడా సిద్ధం చేసుకున్నారు. పన్నుల వసూళ్ళ చేసే రెవిన్యూ విభాగం సిబ్బందిని ఇందుకోసం వినియోగిస్తున్నారు. ఇప్పటికీ మొండి బకాయిలు దాదాపు పది కోట్లకు పైగానే వున్నట్లు సమాచారం. రాజకీయ ఒత్తిళ్ల లేకుంటే పన్నులు సక్రమంగా వసూలుచేసే అవకాశం వుంటుంది. అధిక మొత్తంలో పన్ను బకాయిపడిన వారు ఏదో ఒక రాజకీయ పార్టీ నేతను ఆశ్రయించి అధికారులపై ఒత్తిడి చేయిస్తున్న సంఘటనలు వున్నాయి.

# బూడిద రోడ్లు వేస్తున్నారు

నెల్లూరు నగరంలో దెబ్బతిన్న రోడ్ల స్థానంలో రోడ్లు, భవనాల శాఖ అధికారులు బూడిద రోడ్లు వేస్తున్నారు. కొద్దిపాటి వర్షం వచ్చినా ఈ బూడిద రోడ్లు తిరిగి మరమ్మత్తులకు గురయ్యే అవకాశం వుంది. ప్రధానంగా ముత్తుకూరు వైపు వెళ్లే రహదారిపై బూడిదతో వేసిన రోడ్డును ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఈ రోడ్డుపై భారీ వాహనాలు వెళితే దుమ్ము, ధూళి పైకి లేస్తుంది. రోడ్డుకు ఇరువైపులా వున్న గృహాల్లోకి దుమ్ము



బూడిద పొర లేచి పోయిన ముత్తుకూరు వెళ్లే రోడ్డు.

చేరి నివాసితులు ఇబ్బందులు పడుతున్నారు. తారు, కంకరను సక్రమంగా మిక్సింగ్ చేసి రోడ్డు వేయకపోవడం వలనే ఈ పరిస్థితి తలెత్తింది. రోడ్ల మరమ్మత్తుల పేరిట లక్షలాది రూపాయలు బిల్లులు చేసుకొంటున్న అధికారులు బూడిద రోడ్లు వేయడం ఎంతవరకు సమంజసమని ప్రజలు ప్రశ్నిస్తున్నారు. ప్రతి రెండు నెలలకోసారి నగరంలోని పలు రోడ్లను మరమ్మత్తులు చేస్తుంటారు. లక్షల రూపాయలు ఖర్చు చేస్తున్నా రోడ్లు మాత్రం బాగుపడడం లేదు. రోడ్ల మరమ్మత్తుల పేరిట ఖర్చు చేస్తున్న నిధులపై విచారణ జరపడంతో పాటు నాణ్యమైన రోడ్లను నిర్మించేందుకు ప్రభుత్వమే చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

• ఘనంగా

# వేదవ్యాస స్కూల్ వార్షికోత్సవం



వార్షికోత్సవంలో చిన్నారుల నృత్య హేల.

మాగుంట లేఅవుట్‌లోగల వేదవ్యాస స్కూల్ 23వ వార్షికోత్సవం కస్తూరిబా కళాక్షేత్రంలో ఫిబ్రవరి 16వ తేది విద్యార్థుల ఆటపాటల నడుమ వేడుకగా జరిగింది. పిల్లలకు ఎప్పటికప్పుడు మారుతున్న కాలానికనుగుణంగా నాణ్యమైన విద్యనందిస్తున్న పాఠశాల యాజమాన్యం వార్షికోత్సవ వేడుకలను తమదైనశైలిలో నిర్వహించడం విశేషం. చదువుతోపాటు విద్యార్థుల్లో దాగున్న ప్రతిభను వెలికితీయాలన్న లక్ష్యంతో వివిధ రకాల సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన నగర శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి వార్షికోత్సవాలు పిల్లలకు పండుగలాంటివని అభిప్రాయపడ్డారు. ప్రతి ఏడాది నూరు శాతం ఫలితాలను సాధించడంతోపాటు ప్రతిభ అవార్డులను కైవసం చేసుకోవడంలోనూ వేదవ్యాస స్కూలు ప్రత్యేకత సాధించిందన్నారు. విద్యార్థులకు కొత్త పరిజ్ఞానాన్ని అందించాలన్న లక్ష్యంతో వినూత్న తరహాలో స్మార్ట్ క్లాసులను ప్రారంభించిన ఘనత ఈ పాఠశాలకే దక్కుతుందన్నారు. మాజీ మేయర్ భానుశ్రీ మాట్లాడుతూ పిల్లల పట్ల శ్రద్ధ, పాఠ్యాంశాల బోధనలో ప్రత్యేకత వేదవ్యాస యాజమాన్యం పాటిస్తున్న చర్యలంటూ యాజమాన్యాన్ని ఆమె అభినందించారు. అనంతరం వివిధ తరగతుల విద్యార్థులు ప్రదర్శించిన నృత్యాలు ఆకట్టుకొన్నాయి. ఈ పాఠశాల కరస్పాండెంట్ ఎ.పి.బాలాజీ, ఎ.పి.గిరిల ఆధ్వర్యంలో జరిగిన ఈ వార్షికోత్సవ వేడుకల్లో విద్యార్థులు, తల్లిదండ్రులు పాల్గొన్నారు.

# మత్స్యకారులకు ఇక గుర్తింపు కార్డులు!



జిల్లాలోని సముద్ర తీరప్రాంతంలో వున్న మత్స్యకారులకు గుర్తింపు కార్డులు అందజేసేందుకు కేంద్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. సముద్ర మార్గం ద్వారా టెర్రరిస్టులు మన భూభాగంలోకి చొరబడే అవకాశం వుందని నిఘా వర్గాలు హెచ్చరించడంతో గుర్తింపు కార్డులు జారీచేయాలని నిర్ణయించారు. ఈ మేరకు మత్స్యకార గ్రామాల్లో ఉపాధ్యాయుల చేత సర్వే చేయించి జాబితా కూడా సిద్ధం చేశారు. జిల్లాలోని కావలి, బోగోలు, అల్లూరు, విడవలూరు, ఇందుకూరుపేట, ముత్తుకూరు, టి.పి.గూడూరు, చిల్లకూరు, వాకాడు, తడ తదితర మండలాల్లోని మత్స్యకారులకు గుర్తింపు కార్డులు అందజేస్తారు. భవిష్యత్తులో ఎటువంటి ఇబ్బందులు తలెత్తకుండా వుండేందుకు గుర్తింపు కార్డులు జారీ చేస్తున్నారు. ఈ కార్యక్రమాన్ని మండల తహశీల్దార్‌లకు అప్పగించడం జరిగింది. గుర్తింపు కార్డులున్న మత్స్యకారులకి ప్రభుత్వ పథకాలు వర్తింపజేసే అవకాశం వుందని అధికారులు చెబుతున్నారు.

# ఐసిడిఎస్ పిడి × అదనపు జెసి

జెసి జోక్యాన్ని నిరసిస్తున్న పిడి శారద





జిల్లా స్త్రీ, శిశు సంక్షేమ అభివృద్ధి సంస్థ పనితీరుపై అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య ఇటీవల దృష్టి సారించారు. ఈ శాఖ ఆధ్వర్యంలో అమలవుతున్న పథకాలు, చేస్తున్న కార్యక్రమాలపై అనేక ఆరోపణలు వున్నాయి. ఈ శాఖలో విధులు నిర్వహిస్తున్న సిబ్బంది మొత్తం మహిళలే. అయితే గత సంవత్సరం నుంచి తీవ్ర ఆరోపణలు, విమర్శలు ఎన్నివచ్చినా జిల్లాస్థాయి అధికారులెవరు కూడా ప్రాథమిక విచారణ చేపట్టలేక పోయారు. జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్‌గా బాధ్యతలు స్వీకరించిన సీతారామయ్యకు సంక్షేమ శాఖల పనితీరు, పథకాల అమలును పర్యవేక్షించాల్సిన అధికారాన్ని ప్రభుత్వం అప్పగించింది. విధి నిర్వహణలో కఠినంగా వ్యవహరించే వ్యక్తి కాదు అదనపు జెసి. ఈయన మెతకవైఖరిని ఆసరా చేసుకున్న సంక్షేమ శాఖలకు చెందిన అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ విధులకు సైతం దుమ్మా కొడుతుంటారు. ఈ క్రమంలో ఐసిడిఎస్ ఆత్మకూరు ప్రాజెక్టులో కంప్యూటర్ ఆపరేటర్ నియామకం చేపట్టారు. ఇందుకు జిల్లా మంత్రి ఒక వ్యక్తిని సిఫార్సు చేయగా జిల్లా కలెక్టర్ మరో వ్యక్తిని సిఫార్సు చేయడం జరిగింది. జిల్లా కలెక్టర్ ఆదేశాలపై పనిచేయాల్సిన ఐసిడిఎస్ పిడి శారద మంత్రి మాటకే ప్రాధాన్యతనివ్వడం చర్చనీయాంశంగా మారింది. ఈ నేపథ్యంలో స్త్రీ, శిశు సంక్షేమ శాఖ కార్యాలయాన్ని ఆకస్మికంగా అదనపు జెసి ఇటీవల తనిఖీ చేశారు. ఉదయం 11.30 గంటలకు కూడా పిడి, ఇతర సిబ్బంది విధులకు హాజరు కాకపోవడం బయట పడింది. అదనపు జెసి తనిఖీ కోసం వచ్చారన్న సమాచారం అందడంతో ఆఘమేఘాల మీద కార్యాలయానికి చేరుకుంది పిడి. నిధుల వినియోగం, సంక్షేమ పథకాల అమలు కోసం ప్రభుత్వం విడుదల చేసిన నిధుల వివరాలను సమగ్రంగా పరిశీలన జరిపారు. రికార్డుల్లో కొంత వ్యత్యాసం వుండడంతో రికార్డులను తన వెంట తీసుకెళ్లారు అదనపు జెసి. పిడి శారద భర్త చెన్నైలో వుంటున్నారు. పర్యటన పేరు చెప్పి ఈమె నిత్యం చెన్నైలో వుంటున్నారన్న అభియోగాలు కూడా వున్నాయి. ఈమె బాధ్యతలు చేపట్టిన తర్వాత ఐసిడిఎస్ కార్యాలయాలకు చుట్టుపుచూపుగా వెళ్లి తనిఖీలు చేస్తున్నదే తప్ప బాధ్యతాయుతంగా వ్యవహరించడం లేదన్న ఫిర్యాదులు అందినట్లు సమాచారం. అదనపు జెసి, ఐసిడిఎస్ పిడి శారదల మధ్య వివాదాలు చోటుచేసుకోవడంతో పరిపాలనాపరంగా ఇబ్బందులు తలెత్తే అవకాశం వుందని శాఖలోని ఉద్యోగులు చర్చించుకుంటున్నారు. జిల్లా మంత్రి అండదండలుండడంతో తనను ఎవరు ఏమీ చేయలేరన్న ధీమాతో జిల్లా ఉన్నతాధికారుల ఆదేశాలను పిడి ఖాతరు చేయడం లేదని తెలుస్తుంది.

# అరాచక రాజ్యం

## అభివృద్ధి వైపు జెట్ వేగంతో పరుగులు పెడుతున్న రాష్ట్రాన్ని తిరోగమనం పాలు చేస్తున్న నేతలు

ఆంధ్ర రాష్ట్రంలో మరీ ముఖ్యంగా తెలంగాణ ప్రాంతంలో ప్రభుత్వ ఉనికి లేకుండా పోతున్నది. అరాచక రాజ్యం నెలకొంటున్నది. గతవారం రోజులుగా సహాయ నిరాకరణ పాటిస్తున్న తెలంగాణ ఉద్యోగుల సంఘాల నేతలు ప్రభుత్వ ఉనికిని సవాలు చేస్తున్నారు. తెలంగాణ జిల్లాల్లో పరిపాలనను స్తంభింప చేస్తున్నారు. ఒక్క ప్రభుత్వ కార్యాలయంలో కూడా కాగితం కదలడం లేదు. అన్ని రకాల పన్నుల చెల్లింపులు నిలిచిపోయాయి. ప్రభుత్వ ఖజానా ఒట్టి పోతున్నది. పరీక్షల సీజన్లో విద్యా సంస్థలు మూతపడుతున్నాయి. విద్యార్థులు తమ భవిష్యత్తు పట్ల తీవ్ర ఆందోళన చెందుతున్నారు. సహాయ నిరాకరణ నిలుపుదలకు ప్రభుత్వం సరైన జాగ్రత్తలు పాటించకపోతే రేపు మార్చి, ఏప్రెల్ నెలల్లో పరీక్షలు జరగడం అనుమానమే. విద్యార్థులు చాలా నష్టపోతారు. పన్నుల చెల్లింపులలో వస్తున్న అడ్డంకులను తొలగించుకోకపోతే, రేపు నెల 1తేది జీతాలు ఇవ్వడం అనుమానమే. ఆంధ్ర ప్రాంతం నుంచి వస్తున్న పన్నుల మొత్తాలు మొత్తం రాష్ట్రానికి జీతాలకివ్వడానికి సరిపోవు. కేంద్రం సహాయం చేసే స్థితిలో లేదు. తెలంగాణ జెఏసి నిర్వహించిన 48 గంటల బంద్ అనుకొన్నదానికంటే అధికంగా విజయవంతమయ్యింది. వ్యాపారులు స్వచ్ఛందంగా తలుపులు మూసి వేశారు. ఒక్క పెట్రోల్ బంక్ కూడా తెరవలేదు. దానితో కార్లున్న వారు కూడా పెట్రోల్ లేక ఇళ్లలోనే వుండి పోవలసి వచ్చింది. ఆటోలు అసలే తిరగలేదు. బస్సులు నడవలేదు. ప్రజాజీవనం అస్తవ్యస్తంగా మారింది.

ఈ అరాచక, అనిశ్చిత స్థితి వల్ల రాష్ట్రంలో కొత్తగా పరిశ్రమలు పెట్టాలనుకొన్నవారు తమ ఆలోచనలు మార్చుకొంటున్నారు. తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలకు వెళ్లి పోతున్నారు. ఇదే పరిస్థితి కొనసాగితే రానున్న ఒకటి రెండేళ్లలోనే రాష్ట్రంలో నిరుద్యోగ సమస్య తీవ్ర రూపం దాలుస్తుంది. అది మరింత సామాజిక అశాంతికి దారి తీస్తుంది.

ఫీజులు వస్తాయో రావో అన్న అనుమానంతో విద్యార్థులు; పెన్షన్లు, రేషన్ కార్డులు ఇస్తారా లేదా అన్న సమస్యతో పేద ప్రజలు తీవ్ర అసంతృప్తికి లోనౌతున్నారు. వారిలో ప్రభుత్వం పట్ల ద్వేషం పెరిగి పోతున్నది. తెలంగాణ సమస్య ఈ నిప్పును మరింత రాజేస్తున్నది.

కిరణ్‌కుమార్‌రెడ్డి అన్ని రూపాలలో పాలన చేతకాక చతికిలపడి పోతున్నాడు. ఏ పని పూర్తి చేయలేకపోతున్నాడు. చాదస్తపు మొగుడు చెప్తే వినడు, కొడితే ఏడుస్తాడన్నట్లు వుంది ఆయన పరిస్థితి. పాలనలో వయసుకు అనుభవం లేదు. అనుభవం వున్న వారి నుంచి సలహాలు తీసుకొనే మనసు లేదు. తన అసమర్థతతో, చేతకానితనంతో రాష్ట్రాన్ని అధోగతిపాలు చేస్తున్నాడన్న నింద కిరణ్ మీద పడుతున్నది. మరొకప్రక్క ఆయన క్యాబినెట్‌లో సగానికి పైగా మంత్రులు జగన్‌తో సంబంధాలు పెట్టుకోవడానికి తహతహలాడుతున్నారు. కిరణ్‌ను నమ్ముకొంటే రేపటి ఎన్నికలలో గోవిందా కొట్టవలసి వస్తుందన్న భయంతో జగన్‌ను ఆశ్రయిస్తున్నారు అందరూ. చిరంజీవి విలీనం కూడా వారిలో విశ్వాసాన్ని పెంపొందించడం లేదు.

మొత్తం మీద రాష్ట్రం పరిస్థితి చూస్తే చాలా నిరాశాజనకంగా వుంది. అభివృద్ధి వైపు జెట్ వేగంతో పరుగులు పెడుతుండిన రాష్ట్రాన్ని చేజేతులా తిరోగమనం పాలు చేస్తున్నారు. విచారకరమైన విషయం ఇది.

## కిరణ్ బేజారు

మొదటి పేజీ కొరవ

వరం కల్గించే అంశం. కానీ ఆ లబ్ది పొందడంలో జగన్ విజయం సాధించేశాడు. అందరు రాజకీయవాదులు ఈ విషయంలో ఆయనకంటే ఒక అడుగు వెనకబడ్డారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని ఈ పరిణామం మరింత బేజారెత్తిస్తున్నది. ఇప్పటికే జగన్ వైపు వెళ్తున్న ఎమ్మెల్యేలను నియంత్రించడంలో విఫలం చెందాడని అధిష్ఠానం పెద్దలు కిరణ్ పట్ల అసంతృప్తితో వున్నారు. ముఖ్యమంత్రిగా ఆయన పనికిరాడన్న భావన ఢిల్లీ వర్గాలలో ప్రబలంగా వుంది. ఇప్పుడు జనంలో కూడా జగన్ ప్రభావాన్ని అడ్డుకోలేక పోయాడన్న అభిప్రాయం ఢిల్లీ పెద్దలకు కల్గితే కిరణ్ కుర్చీకి ఎసరు వచ్చినట్లే లెక్క.

## పులివెందులకు ఫిఫ్టీన్ – పీలేరుకు ఫిఫ్టీ

వైఎస్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు పులి వెందుల అభివృద్ధి కోసం ఒక అథారిటీ ఏర్పాటు చేసి, ప్రత్యేకంగా నిధులు ఇచ్చే వాడు. మామూలుగా జరిగే అభివృద్ధికి ఈ నిధి అదనం అన్న మాట. వైఎస్ బాటలోనే కొత్త ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కూడా తన స్వంత నియోజకవర్గం పీలేరు అథారిటీ ఏర్పాటుచేసి, దానికి 50 కోట్ల నిధులు కేటాయించేశాడు. విచిత్రం ఏమిటంటే, తన కోసం 50 కోట్ల రూపాయలు ఇచ్చుకొన్న కిరణ్‌కుమార్‌రెడ్డి, వైఎస్ ఎంతో ఇష్టపడే పులివెందుల అథారిటీకి మాత్రం కేవలం 15కోట్ల రూపాయలు కేటాయించాడు. ఆ అథారిటీలో పనిచేసే ఉద్యోగులకు జీతాలకు మాత్రమే సరిపోతుంది ఆ మొత్తం. అభివృద్ధి అనేది శూన్యం. కిరణ్‌కుమార్ రెడ్డి పాటించిన ఈ ఫిఫ్టీన్ టు ఫిఫ్టీ ఫార్ములా వైఎస్ అభిమానుల మనసు కష్టపెడుతున్నది. వైఎస్ అంటే ఎందుకంత కోపమని మధన పడుతున్నారు వారు.

## శాసనమండలి ఎన్నికల ప్రచారం

16వ పేజీ కొరవ

చాలా తేడా వచ్చేసింది. ఎమ్పీటీసీలు, జడ్పీటీసీలు మాత్రమే ఇప్పుడు ఈ నియోజకవర్గ ఓటర్లు. వారి సంఖ్య దాదా పుగా 650 వరకు వుంది. అందులో ఎందరు మరణించారో, ఎందరు రాజీనామా చేసి ఇతర వ్యాపకాలకు వెళ్లి పోయారో లెక్క తీయాల్సి వుంది. గత ఎన్నికలలో వీరిలో కాంగ్రెస్‌కు 360, తెలుగుదేశానికి 230, సిపిఎం, బిజెపి, సిపిఐ వంటి పార్టీలకు నలభై, కొంత మంది స్వతంత్రులు వుండినారు. ఇప్పుడు జగన్ పక్షంలో దాదావు 150 నుంచి 170 మంది వరకు చేరి పోయారని అంచనా. అట్లా వలస వెళ్లిన వారిలో తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల వారిద్దరూ వున్నారు. అందువల్ల ఏ పార్టీకి ఎంత నికర బలమో అంచనా వేయడం చాలా కష్టంగా వుంది.

ఎమ్పీటీసీ, జడ్పీటీసి సభ్యుల పదవీ కాలం రేపు మే నెలతో ముగియనున్నది. కేవలం మూడు నెలల పదవీ కాలం మిగిలి వున్న పరిస్థితులలో ఎవరో ఒకటి రెండు శాతం తప్ప దాదాపుగా అందరూ ఎక్కడ గిట్టుబాటు వుంటే అటు వెళ్తారే తప్ప, పార్టీ అనుబంధాలు పట్టించుకోక పోవచ్చు. దానితో ఓటు విలువ 50వేల నుంచి లక్ష రూపాయలు పలికే అవకాశం కన్పిస్తున్నది. ఇది కాక నాయకులకు ఎంతో కొంత తిన్పించాలి. వీటికి అదనంగా ఓటర్లతో క్యాంపులు నడపక తప్పదు. ఆ ఖర్చు తడిసి మోపెడౌతుంది. ఈ కోణం నుంచి చూస్తే ఎమ్మెల్సీ కావాలనుకొన్న వారు మూడు నుంచి ఎనిమిది కోట్ల వరకు ఖర్చు పెట్టక తప్పదు.

ఎన్నికల ఖర్చు అంత భారీగా తయారౌతుండడంతో కేవలం శ్రీమంతులు మాత్రమే రంగంలో మిగులుతున్నారు. సాంప్రదాయ రాజకీయ కుటుంబాల వారు ఆ జోలికి కూడా వెళ్లలేని పరిస్థితి. కాంగ్రెస్ పక్షంగా వాకాటి నారాయణరెడ్డి, బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి పేర్లు ప్రబలంగా విన్పిస్తున్నాయి.

తెలుగుదేశం నుంచి బీద రవిచంద్ర పేరు తీవ్రంగా పరిశీలనలో వుంది. నాగేశ్వరరావు అనే వెంకటగిరి వాస్తవ్యుడు, మద్రాసు ఎగుమతి దిగుమతుల వ్యాపారి పేరు కూడా ప్రస్తావనకు వస్తున్నది. జగన్ పార్టీ నుంచి రామిరెడ్డి ప్రతాపరెడ్డి, పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి పేర్లు విన్పడుతున్నాయి.

మూడు పార్టీల మధ్య ఓట్ల చీలిక, పార్టీ అనుబంధం కంటే ఓటుకిచ్చే రూపాయల విలువ ఎక్కువ కావడం వల్ల ఎవరిది పైచేయిగా వుందో వూహించడం చాలా కష్టమైన పని. జగన్ పార్టీ మాత్రం, తాము గెలవక పోయినా పర్వాలేదు, కాంగ్రెస్ అధికార అభ్యర్థిని ఓడించి తీరాలనే వ్యూహంలో నడుస్తున్నట్లు చెప్తున్నారు. అందువల్ల వారు తమ అభ్యర్థి పేరు మీద పెద్దగా కసరత్తు చేయడం లేదు. కాంగ్రెస్ నుంచి ఎవరు బయటకు వస్తారో చూద్దామని వేచి వున్నారు. తెలుగుదేశం కూడా కాంగ్రెస్ ఏకీకృతంగా వుంటుందా, వర్గాల కుమ్ములాటలతో చీలికలౌతుందా అన్నది చూసి ఆ తర్వాత నిర్ణయం తీసుకోవలనే ధోరణిలో వుంది. తెలుగుదేశంలో అభ్యర్థి నిర్ణయం పూర్తిగా సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి ఇష్టాఇష్టాల మీద ఆధారపడి వుంటుంది. ఆయన అభ్యర్థిని పోటీ పెట్టాలనే నిర్ణయం తీసుకొంటే, పెడతారు. వద్దు అనుకుంటే మానుకొంటున్నారు. ఎవరు అభ్యర్థి అనేది కూడా ఆయన నిర్ణయమే. జిల్లా తెలుగుదేశం పార్టీ మీద అంత గట్టిపట్టు సాధించాడు సోమిరెడ్డి.

కాంగ్రెస్‌లో ఇప్పుడున్న పరిస్థితిని బట్టి చూస్తే, అభ్యర్థి నిర్ణయం పూర్తిగా ఆనం రామనారాయణరెడ్డి ఇష్టాఇష్టాల మీద ఆధారపడి వుంటుంది. ముఖ్యమంత్రి ఆయన మాటే వింటాడు. అయితే ఆనం సోదరులు వద్ద స్థానిక సంస్థల ఓట్లు పెద్దగా లేవు. గెలుపు ఓటములు నిర్ణయించే స్థాయి ఓటు బలం వున్న వాడు నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి మాత్రమే. ఆనం వారికి బొమ్మిరెడ్డికి మరొక అవకాశం ఇవ్వాలన్న ఆలోచన వున్నట్లుంది. వాకాటి నారాయణరెడ్డి కూడా వారికి అభ్యంతరమేమీ కాదు. జనార్దన్‌రెడ్డి ఎవరిని కోరుకొంటే వారే అభ్యర్థి అవుతారని భావించవచ్చు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### విద్యా హక్కు చట్టం అమలుకు శ్రీకారం

కేంద్ర ప్రభుత్వం అమలు చేయనున్న విద్యా హక్కు చట్టంకు ఎట్టకేలకు అడ్డంకులు తొలగాయి. ఈ చట్టంపై అపోహలున్నాయన్న కారణంతో కొందరు రాష్ట్ర హైకోర్టులో పిటీషన్ దాఖలు చేశారు. దీంతో రాష్ట్ర ప్రభుత్వం విద్యా హక్కు చట్టం అమలు గురించి అధికారికంగా ప్రకటన చేయలేకపోయింది. ప్రస్తుతం అన్ని అడ్డంకులు తొలగి పోవడంతో ప్రభుత్వం ప్రకటన జారీ చేసింది. జిల్లాలో రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో విద్యాహక్కు చట్టం 2011 – 12 సంవత్సరం నుంచి అమలు కానుంది.

### కంచి స్వామి ఆశీస్సులు పొందిన నేతలు

కోదూరుపాడులో జరిగిన కార్యక్రమంలో పాల్గొనేందుకు విచ్చేసిన కంచి కామకోటి పీఠాధిపతులు జయేంద్ర సరస్వతి స్వామిని దర్శించిన పలువురు నేతలు ఆయన ఆశీస్సులు అందుకొన్నారు. సర్వేపల్లి శాసన సభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, టిడిపి జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి, ఆనం విజయకుమార్‌రెడ్డి తదితరులు స్వామి ఆశీర్వాదం పొందిన వారిలో వున్నారు.

## కుములుతున్న గవర్నర్

మొదటి పేజీ కొరవ

వూహనే తట్టుకోలేకపోతున్నాడు నరసింహన్. తనను కలవడానికి వచ్చిన వారందరితో ఈ అభిప్రాయాన్నే చెప్తూ బాధ వ్యక్తం చేస్తున్నాడు. తెలంగాణ న్యాయవాదులతో కూడా అదే మాట అన్నాడాయన.

కిరణ్‌కుమార్‌రెడ్డి అసమర్థత వల్లనే ఈ దుస్థితి ఏర్పడిందన్నది గవర్నర్ అభిప్రాయం. సభలో తెలంగాణ వాదులు గొడవ సృష్టించడం ఖాయం అని తెలిసి కూడా సరైన సంఖ్యలో మార్షల్స్‌ను ఏర్పాటు చేయకుండా నిర్లక్ష్యం వహించాడని అందువల్లనే తనకీ అవమానం జరిగిందని గోడు గోడు మంటున్నాడు నరసింహన్.

# సేవా కార్యక్రమాల నిర్వహణలో ఆర్యవైశ్యులు పోటీపడాలి!



నెల్లూరు అర్బన్ ఆర్యవైశ్య సంఘం కార్యవర్గ ప్రమాణ స్వీకార ఉత్సవంలో మాట్లాడుతున్న మాజీ ముఖ్యమంత్రి రోశయ్య.


రోశయ్యను సన్మానిస్తున్న ఆయన చిన్ననాటి మిత్రుడు కె.వి.చలమయ్య.

నెల్లూరు అర్బన్ ఆర్యవైశ్య సంఘం నూతన కార్యవర్గ ప్రమాణస్వీకారోత్సవం ఫిబ్రవరి 20వతేది అట్టహాసంగా జరిగింది. మైపాడుగేటు సెంటర్ వద్ద గల కెపిఆర్ కళ్యాణ మండపంలో జరిగిన ఈ కార్యక్రమానికి మాజీ ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య దంపతులు ముఖ్యఅతిధులుగా హాజరయ్యారు. వైశ్యులనుద్దేశించి రోశయ్య మాట్లాడుతూ సేవా కార్యక్రమాల నిర్వహణలో వైశ్యులు పోటీపడాలని పిలుపునిచ్చారు. రాష్ట్ర ప్రభుత్వం పేదరికాన్ని రూపుమాపేందుకు పలు పథకాలు చేపడుతోందని, ఆ విధంగానే వైశ్యులు పేదలకు సహాయపడడంలో తమవంతు పాత్ర పోషించాలన్నారు. పేద వైశ్యులను ఆదుకొనేందుకు ప్రతి ఒక్కరు ముందుకు రావాలన్నారు. గతంలో ఎందరో వైశ్యులు కష్టపడి సంపాదించిన డబ్బుతో ఆస్తులను, దేవాలయాలను, సంస్థలను మనకు అందించారని కానీ కొంతమంది దుష్టశక్తుల కారణంగా వైశ్యుల ఆస్తులు, దేవాలయాలు ఎండోమెంట్ పరిధిలోకి వెళ్లిపోవడం బాధాకరం అన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న సమయంలో తిరిగి వైశ్యుల ఆస్తులు, సంస్థలను వారికే దక్కేలా చర్యలు తీసుకొన్నారని గుర్తు చేశారు. ఇది రాజకీయ వేదిక కాదు పదవుల కోసం పోటీపడడానికి, అందుకని సేవ చేయడంలో పోటీపడాలని వైశ్యులందరూ ఐక్యంగా ఏకతాటిపై నడవాలని సూచించారు. వైశ్యుల ఓట్లు, వారి ఆర్థిక సహకారంతోనే శాసన సభ్యునిగా ఎన్నికయ్యే అవకాశం లభించిందని నగర శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి అన్నారు. అలాంటి వైశ్యులకు తన అండదండలు ఎల్లప్పుడూ వుంటాయని, వేమాలశెట్టి బావి సత్రం స్థలంలో కన్యకాపరమేశ్వరి ఆలయ నిర్మాణానికి కోర్టు సమస్యలు పరిష్కరింపబడేలా తనవంతు సహకారం అందిస్తానన్నారు. అనంతరం పేద వైశ్యులకు వాసవి ఉపాధి పథకం పేరుతో గ్రైండర్లు, కుట్టు మిషన్లు అందజేశారు. వడ్డీలేని రుణాలను అందజేస్తామని ఆర్యవైశ్యనేతలు ప్రకటించారు. అర్బన్ ఆర్యవైశ్య సంఘం నూతన అధ్యక్షునిగా కోట గురుబ్రహ్మం, ప్రధాన కార్యదర్శిగా తులసి చంద్రశేఖర్, కోశాధికారిగా జొన్నలగడ్డ రామ్మోహన్, ఉపాధ్యక్షులుగా అచ్యుత సుబ్రహ్మణ్యం, సత్యనారాయణ, సుబ్బారావు, మహిళా విభాగం అధ్యక్షురాలిగా లక్ష్మీకుమారి, ప్రధాన కార్యదర్శిగా మోడెం పూర్ణిమ, కోట స్వరాజ్యలక్ష్మి కోశాధికారిగా ఇతర కార్యవర్గ సభ్యులు ప్రమాణ స్వీకారం చేశారు. కార్యక్రమానంతరం రోశయ్య దంపతులను ఘనంగా సన్మానించారు.



# ఆద్యంతమూ చదివించే యోగి వేమన కవితా విలసనం!

**పుస్తకసమీక్ష**

**యోగి వేమన కవితా విలసనం**

రచయిత : **సడ్డా సుందరరామరెడ్డి**

సమీక్షకుడు : **డాక్టర్ ధనిశెట్టి లెనిన్**

వెల : **50.రూ** పేజీలు : **103**

**ప్రతులకు**

మమతా నర్సింగ్ హోమ్, రామలింగాపురం, నెల్లూరు. ఫోన్ : 0861 – 2331990

తెలుగునాట వేమన పద్యాలపై వెలువడ్డ అనేక పుస్తకాలలో ఆసక్తికరమైన రచన సడ్డా సుందరరామరెడ్డి రాసిన 'యోగి వేమన కవితా విలసనం'. 330 పద్యాలు, తాత్పర్యాలే కాకుండా పద్యాలలోని విశేషాలతో అదనంగా ఇచ్చిన సమాచారం ఈ పుస్తకాన్ని ఆద్యంతమూ విడవకుండా చదివించేలా చేస్తుంది. డిగ్రీల కోసం పరిశోధనలలా... విశ్వవిద్యాలయాల గ్రాంటుల పరిశోధనలలా కాకుండా వేమన మీద అభిమానంతో రాసిన పుస్తకం కావడం మూలాన వేమన ఆత్మ ఈ పుస్తకంలో స్పష్టంగా ప్రతిఫలించింది. ఏవి వేమన పద్యాలో ఏవి కావో అని నిరంతరమూ సందేహపడే ఈ రోజుల్లో ఈ పుస్తకం చదవగానే ఇవి వేమన పద్యాలయ్యుండొచ్చనే కనీస తృప్తికి పాఠకుడు లోనయ్యే విధంగా పాఠ నిర్ణయం, పద నిర్ణయం వుంది. నిజానికి ఎన్.గోపి, ఆరుద్ర మొదలుగాగల పండితులు వేమనపై వెలువరించిన రచనల్లో సైతం పాఠకుడు ఈ తృప్తిని అనుభవించ లేదు.

వేమన పద్యాలు నీతి విభాగం, ఖండ విభాగం, స్త్రీ విభాగం, తత్వ విభాగం, అనుబంధం అనే అధ్యాయాలలో లఘుటీక, సంక్లిప్త తాత్పర్యంతో రచయిత విభజించి వివరించిన తీరు చాలా బాగుంది. ఇవే కాకుండా ఉపోద్ఘాతంలో వేమన పద్యాల పరిష్కార విధానాలనం క్లుప్తంగా వివరించాడు. ఇదే అధ్యాయంలో వేమన జీవితం వ్యక్తిత్వంపై చిన్న వ్యాసం కూడా వుంది. ఇందులో వేమనకు సంబంధించిన భిన్న కోణాల ఆవిష్కరణ చేశాడు రచయిత. ఈ వ్యాసం మరింత విస్తృతంగా వుంటే బావుండేది. అలాగే వేమన జన్మస్థలానికి సంబంధించిన అనవసర వాదవివాదాల జోలికి వెళ్లకుండా అనుబంధంలో వేమన రాయలసీమవాసి అనిపించే కొన్ని పద్యాలు ఇవ్వడం అభినందనీయం. ఈ పుస్తకం కేవలం వేమన పద్యాలను శాస్త్రీయంగా పరిష్కరించినదే కాదు. వేమనపై ఇప్పటి వరకు సాగించిన పరిశోధనలకు సంబంధించిన పరిశోధకుల బండారాన్ని బయట పెడుతుంది. వేమన జీవిత విశేషాలకు సంబంధించిన పరిష్కారం కాని, చేయలేని పరిశోధకుల అశక్తతపై ఎన్నో ఆలోచనలు రేకెత్తిస్తుంది. ఈ తరానికి పరిచయం చేస్తుంది. సులభ వ్యవహారికంలో జలపాతంలా సాగిపోయే రచయిత సుందరరామరెడ్డి శైలి ఈ రచనకు అదనపు ఆకర్షణను చేకూర్చింది.

### ఈ తరం చదవాల్సి పుస్తకం

నిజానికి వేమన పద్య ప్రేమికులంతా చదివి తీరాల్సిన పుస్తకం ఇది. దాదాపు తొంభై ఏళ్ల వయస్సులో సుందరరామరెడ్డి ఎంతో శ్రమతో రాసిన 'యోగి వేమన కవితా విలసనం' కృషి వృధాకాలేదు. ఈ తరానికి ఇది కొత్త చూపును ప్రసాదిస్తుంది. విశ్వవిద్యాలయాలకు, పరిశోధనలకు ఒక ఉత్ప్రేరకంగా పనిచేస్తుంది. సంస్థ చేయాల్సిన పనిని వ్యక్తి చేయడం మూలాన రచయిత ఎంతో వ్యయప్రయాసలకు లోను కావాల్సి వస్తుంది. కేవలం వేమనపై రచయితకు గల అభిమానం ఈ మంచి పుస్తకానికి మూల కారణం అయ్యింది. వేమనపై వెలువడిన గ్రంథాలలో ప్రజల్లో నిలచిపోయే కొన్ని గ్రంథాలలో వేమన కవితా విలసనం ఒకటి అయితే ఈ పుస్తకాన్ని తెలుగు అకాడమీ, పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం వంటి సంస్థలు ప్రచురిస్తే మం చిది. ప్రతి గ్రంథాలయంలో వుండదగిన పుస్తకం ఇది.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11



# జోరందుకున్న శాసనమండలి ఎన్నికల ప్రచారం!

శాసన మండలి ఎన్నికలు జోరందుకొన్నాయి. మన జిల్లాకు సంబంధించి ఒకేసారి నలుగురు ఎమ్మెల్సీల పదవీ కాలం పూర్తయింది. ఉపాధ్యాయుల నుంచి రామిరెడ్డి, పట్టభద్రుల నుంచి విఠపు బాల సుబ్రహ్మణ్యం, స్థానిక సంస్థల నుంచి బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి, గవర్నర్ నామినేషన్ కోటాలో బూదాటి రాధయ్య పదవులు కోల్పోతున్నారు. గతంలో జరిపిన లాటరీలలో వీరందరికీ నాలుగేళ్ల పదవీ కాలం మాత్రమే దక్కడం ఇందుకు కారణం.

పట్టభద్రులు, ఉపాధ్యాయుల నియోజకవర్గాలలో పెద్దగా పార్టీ రాజకీయాలు ఉండవు. ఉపాధ్యాయులైతే వారి సంఘాలలో ఎవరికి ఎక్కువ సంఖ్య వుంటే వారిదే గెలుపు. పట్టభద్రులలో కూడా సాధారణంగా వామపక్ష భావాలు కల్గిన వారికే పదవులు దక్కుతూ వుంటాయి. అయితే ఈ సారి మాత్రం తెలుగుదేశం అభ్యర్థి డి.హనుమంతరావు గెలుపు దిశగా పరుగులు పెడుతున్నాడు. వ్యక్తిగా సచ్ఛీలుడు కావడం తెలుగుదేశం పార్టీ కోసం అప్పులుచేసి, ఆస్తులమ్మి కష్టపడుతున్న నిబద్ధత కల్గిన కార్యకర్త కావడంతో ఆ పార్టీలో ఆయన మీద ఎనలేని సానుభూతి కన్పిస్తున్నది. దానితో చాలామంది తెలుగుదేశం వాదులు ఆయన గెలుపు కోసం చురుకుగా పని చేస్తున్నారు. న్యాయవాద వర్గాల నుంచి కూడా ఆయనకు మద్దతు లభిస్తున్నది. వామపక్ష, బిజెపి వర్గాలలో ఈసారి ఈ ఎన్నికల పట్ల అంత పట్టుదల కన్పించడం లేదు. కాంగ్రెస్ వాదులు దీనికి ఎప్పుడూ దూరంగా వుంటారు.

అసలైన రాజకీయ ఉద్వేగాలు, ఉద్రిక్తతలు చెలరేగుతున్నది స్థానిక సంస్థల నియోజకవర్గం విషయంలోనే. బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి గత ఎన్నికలలో కాంగ్రెస్ లుకలుకలను, తెలుగుదేశం బలహీనతలను బహు చక్కగా వాడుకొని గెలుపొందాడు. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. ఆయనకు మరొకసారి ఎమ్మెల్సీ కావాలన్న కోరిక వున్నా అందుకు ఎంత అవసరమైతే అంత సొమ్ము కుమ్మరించగల సామర్థ్యమున్నా పరిస్థితులు సానుకూల పడడం లేదు. జగన్ పార్టీ ఏర్పడడం, మేకపాటి సోదరులు, జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి అందులో కలిసి పోవడంతో స్థానిక సంస్థల ఓట్ల బలాబలాలలో

కొరవ 14వ పేజీలో



## టీవీ9 జాఫర్‌కు యునిసెఫ్ అవార్డు!



జాఫర్‌బాబుకు యునిసెఫ్ అవార్డును అందజేస్తున్న డిప్యూటీ స్పీకర్ నాదెండ్ల మనోహర్. ప్రక్కన అక్కినేని నాగేశ్వరరావు, అమల.

నెల్లూరు యువ జర్నలిస్ట్ ప్రస్తుతం టీవీ9 విజయవాడ బ్యూరో మహమ్మద్ జాఫర్ బాబు అత్యంత ప్రతిష్టాకరమైన యునిసెఫ్ బెస్ట్ రిపోర్టర్ అవార్డు పొందారు. ఈ అవార్డు పొందిన తొలి నెల్లూరు జర్నలిస్ట్ జాఫర్‌బాబునే. నగరంలోని దాడివారి వీధికి చెందిన జాఫర్‌బాబు 1994లో ఆంధ్రజ్యోతి దినపత్రికలో కంట్రిబ్యూటర్‌గా చేరి అప్పటి స్టాఫ్ రిపోర్టర్ ఆర్ఎం బాషా దగ్గర వ్రాత నేర్చుకొన్నాడు. కొత్త విషయాలను శోధించాలన్న అతని తపన వల్లే ఈనాడు, ఈ–టీవీ, మాటీవీలను 2004 వరకు చుట్టేశాడు. టీవీ9లో జాఫర్‌బాబు చేరిక అతని గమ్యాన్ని మార్చేసింది. తిరుపతిలో రిపోర్టర్‌గా పని చేసే సమయంలో తిరుమలలో జరిగే అన్యాయాలపై అతను ధారావాహికంగా చేసిన 'గోవిందా... గోవిందా' కార్యక్రమం జాతీయస్థాయిలో ప్రకంపనలు సృష్టించింది. విశాఖపట్నం, హైదరాబాద్‌లలో పని చేస్తున్నప్పుడు ప్రత్యేక వార్తా కథనాలతో జాఫర్ నిరంతరం వార్తల్లో వుండేవాడు. ముంబాయి రెడ్‌లైట్ ప్రాంతంలోని ఆంధ్రా యువతుల దుర్భర జీవితంపై అతను చేసిన 'ఆపరేషన్ రైడ్ లైట్' కార్యక్రమానికి ప్రశంసల జల్లు కురిసింది. దీన్నే ఆయన ఒక పుస్తక రూపం చేశారు. గత ఏడాది కృష్ణాజిల్లా మండపల్లి గ్రామానికి చెందిన దేవమ్మ అనే బాలిక తల్లిదండ్రులు హెచ్ఐవి సోకి మరణించగా ఆమెను స్కూల్‌లో చేర్పించుకోనూ విద్యాశాఖాధికారులు తిరస్కరించారు. ఈ విషయాన్ని జాఫర్ ప్రత్యేక స్టింగ్ ఆపరేషన్ ద్వారా బయటపెట్టి దేవమ్మను మానవ హక్కుల కమిషన్ దగ్గరకు తీసుకవెళ్లి మొత్తం మీద ఆ బాలికను స్కూల్‌కు వెళ్లగలిగేలా చేయగలిగాడు. ఈ కథనానికి రాష్ట్ర ప్రభుత్వం కూడా స్పందించి ఇటువంటి ఇబ్బందులను ఎదుర్కొంటుండిన మరో 12 మంది బాలికలను స్కూళ్లలో చేర్చుకోమని ప్రత్యేక వుత్తర్వులిచ్చింది.

ఢిల్లీలో స్వతంత్ర్యంగా నడిచే సిఎంఎస్ సంస్థ దేశంలోని అన్ని న్యూస్‌ఛానళ్లలో ప్రసారమయ్యే వార్తా కథనాలన్నీ వడపోసి జాఫర్ కథనం బెస్ట్ అనడంతో యునిసెఫ్ ఈ అవార్డుతో ఆయన్ను గతవారం హైదరాబాద్‌లో సత్కరించింది. యునిసెఫ్ అవార్డుతో నెల్లూరు జర్నలిస్ట్‌ల ప్రతిష్ట పెంచిన జాఫర్‌కు మా అభినందనలు.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.